NP 007 బబుల్ గమ్

ఉచితం
మీ 007 ప్యాక్‌లో తెల్లటి బబుల్ గమ్
గనక ఉంటే, అక్కడికక్కడే దుకాణదారుడి
వద్ద నుంచి మరో 007 బబుల్ గమ్‌ను
ఉచితంగా పొందండి.

ఆట స్థలాల్లో గాని, బయటగాని, మన భావి ఆట గాళ్ళందరికీ ఉత్సాహాన్ని కలిగించేది కేవలం NP 007 బబుల్ గమ్ మాత్రమే.
వాళ్ళకి 007 అంటే చెప్పలేనంత ఇష్టం.
ఎందుకంటే, అది 'బబుల్ శక్తి'తో నిండివుందిగా మరి!
NP—బబుల్ గమ్ ఉత్పాదకుల్లో అగ్రగణ్యులు,
ఐఎస్ఐ చిహ్నం ఒక్క ఎన్‌పి బబుల్ గమ్‌లకు మాత్రమే వుంది.

*NP 'బబుల్ శక్తి'కి మరో పేరు బబుల్ గమ్*




IS 6747

పొందండి.

పెల్లుబికే సామర్థ్యం!






Dattaram-NP-16 TEL

ది నేషనల్ ప్రోడక్ట్స్, బెంగుళూరు




# అమృతాంజన్
## లిమిటెడ్‌వారి
## విశిష్టమైన
# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.







అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG (R)

# చందమామ

ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు



ఇవిగాక అమరవాణి, కథాశీర్షిక పోటీ, ఫోటో వ్యాఖ్యలూ వగైరా.


Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [''నాస్తికుడి దైవభక్తి''] కి ఆధారం ''వసుంధర'' రచన. దేవుడిలో అంతులేని నమ్మకం ఉన్నట్టు కనబడేవాళ్ళు కూడా సర్వకాల సర్వావస్థలలోనూ దేవుణ్ణి నమ్ముకుని కూర్చోరు. వాళ్లు తమ శక్తిమీదా, సాటి మానవుల శక్తిమీదా చాలావరకు ఆధారపడతారు. దేవుడు భూస్వాముల పొలాలు కవులుకు తీసుకోడు, ఫాక్టరీలను నడపడు, వైద్యమూ, వడ్రంగమూ చెయ్యడు. అందుచేత హేతువాది అయిన వాడు దేవుణ్ణి అపూర్వశక్తులు గల మానవుడిలోనే చూస్తాడు. అది కూడా ఆ శక్తులు తనకు లాభించినప్పుడే.

---

సంపుటి 62 మార్చి '78 పంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






సంశ్రుత్య చ పితు ర్వాక్యం,
మాతు ర్వా, బ్రాహ్మణస్య వా
నకర్తవ్యం వృథా (వీర),
ధర్మ, మాశ్రిత్య తిష్ఠతా. 1

[తండ్రిమాటగాని, తల్లిమాటగాని, బ్రాహ్మణుడిమాటగాని చేస్తానని ధర్మాన్ని అనుసరించే వాడు తప్పరాదు.]

గురుశ్చ, రాజా చ, పితా చ, వృద్ధః
క్రోధా త్ప్రహర్షా ద్యది వాపి కామాత్,
య ద్వ్యాదిశే త్కార్య మపేక్ష్య ధర్మం
క స్త న్న కుర్యా దనృశంసవృత్తిః. 2

[గురువుగాని, రాజుగాని, తండ్రిగాని, వృద్ధుడుగాని, కోపంలోగాని, అధిక సంతోషంలోగాని, కామ ప్రేరణచేతగాని ఆజ్ఞాపించినప్పుడు ఆ పని చేయనివాడు పాపిష్ఠివాడు.]

న సత్యం దానమానే వా,
న యజ్ఞా శ్చాప్తదక్షిణాః,
తథా బలకరా [స్సీతే]
యథా సేవా పితుర్హితా. 3

[తండ్రి కిష్టం కలిగించినందువల్ల కలిగినట్లుగా సత్యంగాని, దానాలుగాని, దక్షిణతో కూడిన యజ్ఞాలుగాని బలం కలిగించలేవు.]



# కాకోలూకీయం

## 57

రక్తాక్ష వద్రంగి కథ చెప్పి, "మిత్రులారా, ఈ కాకి మాటలు విని మోసపోవద్దు. ఈ కాకి ఎప్పటికీ మన శత్రువే నని మీవంటి బుద్ధిమంతులు గ్రహించగలరు," అన్నది.

కాని మిగిలినవి అతడి సలహా పాటించక, స్థిరజీవిని ఒక డోలీలో తమ పర్వత దుర్గానికి మోసుకుపోయాయి.

స్థిరజీవి రాజుతో, "ఓ రాజా, నా పట్ల ఇంత దయ ఎందుకు చూపుతున్నారు? ఒకప్పుడు నేను మీకు శత్రువు అయి ఉండి నందుకు సిగ్గుపడుతున్నాను. దయచేసి అగ్ని తెప్పించారంటే, నాజీవితం నిరర్థకమై పోయినందుకు దాన్ని అంతం చేసుకుంటాను," అన్నది.

రాజుకూ, అతని నలుగురు మంత్రులకూ ఈ మాటలు నచ్చాయి. "అయ్యా, తమరు అగ్నికి ఆహుతి కావలసిన పని ఏమిటి?" అని అవి అడిగాయి.

"అలా చేస్తే తిరిగి గుడ్లగూబగా పుట్టి, మరెన్నటికీ కాకి జన్మ ఎత్తను," అన్నది కాకి స్థిరజీవి.

కాకి ధోరణి నచ్చని రక్తాక్ష, "నువ్వు గుడ్లగూబగా పుట్టినా కాకుల పక్షమే ఉంటావు, వెనకటికి ఎలుకకన్య చివరకు ఎలుకే అయినట్టుగా!" అన్నది.

"ఏమిటా కథ?" అని స్థిరజీవి అడగగా, రక్తాక్ష ఇలా చెప్పింది:

హిమాలయశిలల నుంచి దూకుతూ, నురుగులు కక్కుతూ గంగానది ప్రవహించేచోట ఒక ఆశ్రమం ఉండేది. ఆ ఆశ్రమంలో అనేక మంది ఋషులు తపస్సు చేసుకునేవారు. యాజ్ఞవల్క్యుడనే ఋషి ఆశ్రమానికి పెద్ద. ఒకనాడు



ఆయన నదిలో స్నానం చేసి తిరిగి పోబోతూండగా ఒక గద్ద ఒక ఆడ ఎలుక పిల్లను ఆయన మీద పడవేసింది. దయగల ఆ ఋషి ఆ ఎలుక పిల్లను తన తపశ్శక్తితో మనిషిపిల్లగా మార్చి, ఆశ్రమానికి తీసుకుపోయి గొడ్రాలయిన తన భార్యతో, ''ఓసీ, ఈ పిల్ల నీ గర్భవాసాననే పుట్టినట్టుగా, శ్రద్ధగా పెంచు,'' అని చెప్పాడు.

ఆమె అదేవిధంగా ఆ పిల్లను ఎంతో శ్రద్ధగానూ, ప్రేమగానూ పెంచి పెద్ద చేసింది. పిల్లకు పన్నెండేళ్లు నిండాయి. యాజ్ఞవల్క్యుడితో అతని భార్య, ''స్వామీ, ఎందుకు తాత్సారం చేసున్నారు? మీ కుమార్తెకు యుక్తవయసు వచ్చింది. పెళ్ళి చెయ్యాలి,'' అన్నది.

''అవును. ఆ మాట నిజమే. శాస్త్ర ప్రకారం దానికి వివాహ యోగ్యమైన వయసు వచ్చింది. సంగీతం పాడుతుంది. వంట చేస్తుంది. బాగా చదువుకున్నది. అందుచేత అమ్మాయి సరేనన్న పక్షంలో సూర్యుణ్ణి ఆహ్వానించి, అతనికి పిల్ల నిస్తాను,'' అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

''తప్పేం? అలాగే చెయ్యండి,'' అన్నది భార్య.

ఋషి సూర్యుడికి కబురు పంపాడు. సూర్యుడు వచ్చి, ''మహాత్మా, ఎందుకు నన్ను రమ్మన్నారు?'' అని అడిగాడు.

ఋషి సూర్యుడితో, ''ఇది నా కుమార్తె. దయచేసి దాన్ని వివాహమాడు,'' అని, కుమార్తె కేసి తిరిగి, ''అమ్మా, ముల్లోకాలనూ ప్రకాశవంతం చేసే ఈ దేవుణ్ణి పెళ్ళాడటం గురించి నీ అభిప్రాయం ఏమిటి?'' అని అడిగాడు.

''ఈయన మరీ వేడిగా ఉన్నాడు. ఇంతకన్న గొప్ప సంబంధం ఉంటే చూడు,'' అన్నది కూతురు.

ఋషి సూర్యుణ్ణి, ''నీకన్న గొప్పవాడెవరు?'' అని అడిగాడు.

''నాకన్న మబ్బు గొప్పది. అది నన్ను పూర్తిగా కప్పివేసి, నా జాడ ఎవరికి

కనపడకుండా చేయగలదు,'' అన్నాడు సూర్యుడు.

ఋషి మబ్బును పిలిపించి, తన కుమార్తెను, ''అమ్మా, నిన్ను ఈ శక్తిమంతుడికిచ్చి పెళ్లిచేయనా?'' అన్నాడు.

''ఇతను నల్లగానూ, తేమగానూ ఉన్నాడు. ఇతనికన్న గొప్పవాడెవరో ఇతన్ని అడిగి తెలుసుకుని, నన్ను అతనికిచ్చి పెళ్లి చెయ్యి,'' అన్నది కూతురు.

''నీకన్న గొప్పవాళ్లెవరన్నా ఉన్నారా?'' అని ఋషి మబ్బును అడిగాడు.

''ఉన్నారు. గాలి నాకన్న గొప్పవాడు. గాలి నన్ను అటూ, ఇటూ నెట్టగలదు,'' అన్నది మబ్బు.

ఋషి గాలికి కబురుపెట్టి, ''అమ్మా, నిన్ను ఇతనికిచ్చి పెళ్లిచేయనా?'' అన్నాడు.

''నాన్నా, ఇతను చంచలుడూ, ఆధారపడదగనివాడూ. ఇంతకన్న శక్తిమంతుణ్ణి చూడు,'' అన్నది కూతురు.

''నీ కన్న గొప్పవాడు ఎవడన్నా ఉన్నాడా?'' అని ఋషి గాలిని అడిగాడు.

''పర్వతం నా కన్న చాలా బలమైనది. దాన్ని కదిలించటం నాకు సాధ్యం కాలేదు,'' అన్నది గాలి.

అందుచేత ఋషి పర్వతాన్ని పిలిపించి, ''అమ్మా, నిన్ను ఇతనికిచ్చి పెళ్లి చెయ్యనా?'' అని కూతుర్ని అడిగాడు.

''నాన్నా, ఇతని అంతస్సు పాషాణం. నా అందానికి ఇతను చలించడు. నన్ను మరెవరికైనా ఇయ్యి,'' అన్నది కూతురు.

''నీ కన్న శక్తిమంతుడు ఎవరు?'' అని ఋషి పర్వతాన్ని అడిగాడు.

''నాలో బొరియలు పెట్టే ఎలుక నా కన్న బలమైనది,'' అన్నది పర్వతం.

ఋషి ఎలుకను పిలిపించి, ''అమ్మా, ఇతన్నిచేసుకుంటావా?'' అని అడిగాడు.

ఆమెలో సజాతి అభిమానం పెల్లుబికింది. ఆమె సిగ్గుపడుతూ, ''నాన్నా, నన్ను ఎలుకగా మార్చి, ఇతనికిచ్చి పెళ్లి చెయ్యి,'' అన్నది.

ఋషి ఆమెను ఎలుకగా మార్చి, వివాహం చేశాడు.



# 195. పేటల మధ్య లిఫ్ట్!

ఈ బొమ్మ నడి మధ్యలో కనిపించే లిఫ్ట్ ఎక్కినవారు ఎక్కడికి వెళతారు? లిస్బన్ (పోర్చుగల్) లో ఇంకో పేటకు వెళతారు! లిస్బన్ నగరంలో వివిధ ప్రాంతాల మధ్య కొన్ని "అంతస్థుల" తేడా ఉన్నది. పారిస్‌లో "ఐఫల్" టవర్ నిర్మించినవాడే ఈ లిఫ్ట్‌ను కూడా నిర్మించాడు.





# మాయాసరోవరం

## 27

[ బెబ్బులిదొరనూ, గణాచారినీ బంధించి, సిద్ధసాధకుడు, హిరణ్యపుర రాజైన కనకాక్షుణ్ణి చూడబోయాడు. హంసల రథంలో వున్న జయశీలుడికి, అరణ్యంలో ఒకచోట పులిచేత తరమబడుతున్న కాంచనమాల కనిపించింది. అతడామెను రక్షించాడు. ఆ సమయంలో చాటునవుండి మాయాసరోవరేశ్వరుడు, అతడి మీదికి ఉచ్చుతాడు విసిరాడు. తరవాత—]

జయశీలుడు తన మెడను ఉచ్చుతాడు తాకగానే ఒక తృటికాలం నివ్వెరపోయి, చప్పున వెనుదిగి చూశాడు. అతడికి జలగ్రహం మీద మాయాసరోవరేశ్వరుడూ, పక్కనే గుర్రం మీద మకరకేతూ కనిపించారు.

జయశీలుడు చప్పున తేరుకుని తన కంఠానికి బిగుసుకుపోతున్న తామరకాళ్ల తాడును కత్తితో నరకబోయిన వాడల్లా ఆగి, సరోవరేశ్వరుడి కేసి తేరిపార చూశాడు.

మాయాసరోవరేశ్వరు తన చేతిలోవున్న తాటికొసను కొంచెం లాగి, జయశీలుడితో, "నువ్వేగదా, జయశీలుడనే మహావీరుడువి! తాడును కత్తితో నరకబోయిన వాడివి, ఎందుకు ఆగావు?" అన్నాడు.

"ఆఁ, ఇప్పుడు తెలిసింది, నువ్వు మాయాసరోవరేశ్వరుడి వన్నమాట!



తాడును కంఠానికి ఉచ్చువేసిన వాడివి, దాన్ని గట్టిగా బిగించి, నా ప్రాణాలు తీయ కుండా ఎందుకు వూరుకున్నావు ? '' అని అడిగాడు జయశీలుడు.

'' నేను ఒక సరోవరానికి రాజును, ఎంత మహాసత్వుడైన మానవుడి ప్రశ్న కైనా నేను జవాబివ్వనవసరం లేదు,'' అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

జయశీలుడు యీసారి కోపంగా ఏదో అనబోయేంతలో, అంతవరకూ యీ జరుగుతున్న దానికి నిర్విణ్ణురాలైపోయి చూస్తున్న కాంచనమాల తెప్పరిల్లి, '' మామయ్యా, నువు హంసలరథంలోంచి కిందపడి, ప్రాణాలతో వున్నందుకు చాలా ఆనందంగావున్నది. కాని నువ్వు జయ శీలుడనే యీ యువకుడికి హాని కలి గించకు. ఈయన నన్ను పులిబారి నుంచి రక్షించాడు,'' అన్నది.

'' అమ్మా, కాంచనా! అదంతా నేను స్వయంగా నా కళ్ళతో చూశాను. ఇతణ్ణి చంపాలని లేదు! ప్రాణాలతో బందీగా మాయాసరోవరానికి తీసుకుపోబో తున్నాను,'' అన్నాడు మాయాసరో వరేశ్వరుడు.

కాంచనమాల, జయశీలుడి కేసి తల తిప్పి, '' మామగారు నీ కెలాంటి హానీ కలిగించనంటున్నారు గదా! నువ్వు ఇష్టం గానే, ఆయన వెంట మాయాసరోవరానికి ఎందుకు రాకూడదు ? '' అన్నది.

''కాంచనా, ఇందులో నా యిష్టాయిష్టా లకు తావెక్కడిది ? ఈ సరోవరేశ్వరుడు నన్ను జయించి బందీగా తీసుకుపోతున్నా ననుకుంటున్నాడు. కావాలంటే యీ క్షణాన ఒక్క కత్తివేటుతో, నా కంఠా నికి చుట్టిన తాడును తెగనరకగలను,'' అన్నాడు జయశీలుడు.

జయశీలుడు యిలా అనగానే మాయా సరోవరేశ్వరుడు, తన పక్కన వున్న మకరకేతులో, '' కేతూ, నువ్వు యీ జయశీలుడు పారిపోకుండా దారి అడ్డ గించు. ఈ లోపల నేను ఉరితాడును

కొంచెం బిగలాగి, బలవన్మరణం అంటే ఎలా వుంటుందో, యితడికి తెలిసేలా చేస్తాను,'' అన్నాడు.

మకరకేతు అయిష్టంగా ముఖం పెట్టి, రాజాజ్ఞ గనక చేసేదేమీ లేనందున గుర్రాన్ని అదిలించి, జయశీలుడి కేసి నడిపాడు. అంతలో కాంచనమాల భయకంపితురాలై చిన్నగా కేక పెట్టి, జయశీలుడి కంఠాన్నుంచి వేలాడుతున్న తాడును రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, '' మామయ్యా, ఈ తాడును మరే మాత్రం గట్టిగాలాగి, ఈయన కంఠాన్ని బిగించినా, నేను సహించను. నేనూ, ఈయనతో పాటు యిదే తాడుతో ఉరిపోసుకుంటాను,'' అన్నది.

'' ఆశ్చర్యం! ఈ కొద్ది క్షణాల్లోన్నే కథ యింతదూరం వచ్చిందన్న మాట!'' అంటూ సరోవరేశ్వరుడు ఆశ్చర్యపోయి, తల వంచుకుని ఒకటి రెండు క్షణాలు ఆలోచించి, అయినా ప్రయత్నించి చూడటంలో తప్పేముంది, అని మనసులో అనుకుని, చప్పున తల ఎత్తి, "జయశీలా, నువ్వన్నట్టు కత్తితో నీ మెడను చుట్టిన తాడును తెగకొట్టగలవేమో కాని, ఈ జలగ్రహాన్నుంచి పారిపోలేవు. అది నిన్ను కాళ్ళతో మట్టగించి, కోరలతో పొడిచి భూస్థాపితం చెయ్యగలదు,'' అన్నాడు.



''ఏదీ ప్రయత్నించి చూడు!'' అంటూ జయశీలుడు కత్తిని పైకెత్తి, తాడును నరకబోయేంతలో మకరకేతు చిన్న గొంతుతో, ''జయశీలా, తొందరపడకు! సరోవరేశ్వరుడు నిన్ను మాయాసరోవరానికి తీసుకుపోదలచటంలో చిన్న రహస్యం వున్నది. పైగా, నువ్వా సరోవరాన్ని చేరాలని ఎలాగూ ప్రయత్నిస్తున్నావు గదా?'' అన్నాడు.

జయశీలుడికి, మకరకేతు మాటలు తన మంచికోరి చెప్పినట్టుగా తోచినై. కనకాక్షరాజుగారి పిల్లల్లో కాంచనమాల ఒక్కతే దొరికింది; ఆయన కొడుకు కాంచనవర్మ యింకా ఆ మాయాసరో



వరంలో బందీగానే వున్నాడు. కాని, యీ కాంచనమాల తనను అపహరించుకు పోయిన మాయాసరోవరేశ్వరుణ్ణి, మామయ్యా, అంటూ ఎంతో గౌరవంగా పిలవటం అతడికెంతో ఆశ్చర్యంతోపాటు, అనుమానం కూడా కలిగించింది....

"సరే, మాయాసరోవరేశ్వరా! నువ్వు నా కన్న బలవంతుడివని తెలిసిపోయింది, లొంగిపోయాను. ఇప్పుడు నన్నేం చేయబో తున్నావు?" అని అడిగాడు జయశీలుడు.

"ఈ లొంగిపోయాననటంలో మోసం ఏమీ లేదు గదా?" అని ప్రశ్నించాడు మాయాసరోవరేశ్వరుడు, జయశీలుడి ముఖంలోకి పరీక్షగాచూస్తూ.

"బలదర్పాలు లేనివాడు, మోసాన్ని అడ్డంపెట్టుకుని జీవిస్తాడు. నే నెలాంటి వాడినో, యీ మకరకేతుకు కొంత అయినా తెలిసి వుండాలి. అవునా, మకరకేతూ?" అన్నాడు జయశీలుడు.

"నేను మహారాజుగారికి లోగడే మనవి చేశాను; నువు సామాన్యుడివి కాదు, మహాసత్త్వుల కోవకు చెందినవాడివని," అన్నాడు మకరకేతు.

"సత్యం ఏపాటిదో సరోవరం చేరిం తరవాత చూస్తాను. మనం యింతకు ముందే జలవృకుడొకణ్ణి చూశాంగదా, కేతూ! మిగిలిన దుర్మార్గులు అక్కడ ఎలాంటి భీభత్సం చేస్తున్నారో," అంటూ మాయాసరోవరేశ్వరుడు పెద్దగా నిట్టూర్చాడు.

"అయితే యిప్పుడు నా మెడను చుట్టిన, యీ ఉరితాటి మాటేమిటి?" అని అడిగాడు జయశీలుడు.

మాయాసరోవరేశ్వరుడు జవాబిచ్చే లోపలే కాంచనమాల నవ్వుతూ, జయశీలుడి కంఠాన్నుంచి తాటి ఉచ్చును ఊడదీసి, "ఇది ఉరితాడు కాదు, మామయ్య నీ మెడలో వేసిన తామర తూండ్ల హారం!" అన్నది.

"కథ మెరుపు వేగంతో ముగింపుకు వస్తున్నట్టున్నది. పాపం, పద్మముఖి

అన్నిటా దురదృష్టవంతులరాలే! కనీసం యితడు జలవృకరాజును హతం చేయటానికి సాయపడినా, నాకు గొప్ప మేలు జరిగినట్టే,'' అనుకున్నాడు మాయసరోవరేశ్వరుడు తనలో తాను.

''మహారాజా, ఇప్పుడు ఏం చేయమని ఆజ్ఞ?'' అని అడిగాడు మకరకేతు.

''అందరం సరోవరానికి పోతున్నాం. ముందుండి దారితియ్యి,'' అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

''జయశీలుడు కాలినడకన మనను అనుసరించి రాగలడా?'' అంటూ మకరకేతు, జయశీలుడి కేసి చూశాడు.

''కాంచన నాతోపాటు జలగ్రహం మీద వస్తుంది. నువ్వూ, జయశీలుడూ గుర్రంమీద బయలుదేరండి,'' అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

కాంచనమాల కూడా తిరిగి మాయా సరోవరానికి తీసుకుపోబడుతున్నదని వింటూనే జయశీలుడు గతుక్కుమని, మకరకేతుతో, ''కేతూ, కాంచనమాలను తిరిగి మాయాసరోవరానికి తీసుకుపోయేందుకు నే నొప్పను. కనకాక్షరాజు గారికి, అపహరించుకుపోబడ్డ పిల్లలిద్దర్నీ తెచ్చి ఒప్పచెపుతానని వాగ్దానం చేశాను. దొరికిన యీవిణ్ణి మళ్ళీ నిర్బంధానికి గురిచేసేందుకు వీల్లేదు,'' అన్నాడు.



మాయాసరోవరేశ్వరుడు కోపంగా జయశీలుడి కేసి చూశాడు. కాంచనమాల కూడా అతడికేసి కోపంగా చూస్తూ, ''నేనూ, మా అన్న కాంచనవర్మ అరణ్యంలో నుంచి అపహరించుకుపోబడిన మాట నిజమేగాని, ఎవరి నిర్బంధంలో మాత్రం లేము. అన్న వెంట లేకుండా నేను ఒక్కదాన్నే, నా తలిదండ్రుల వద్దకు ఎలా వెళ్ళేది? చేతనైతే, నా అన్నను కూడా నువ్వనే నిర్బంధాన్నుంచి విముక్తుణ్ణి చెయ్యి,'' అంటూ చకచకా జలగ్రహం దగ్గిరకు పోయి, మాయాసరోవరేశ్వరుడు అందించిన చేయి ఆధారంతో, దానిమీద ఎక్కి కూర్చున్నది.



"కేతూ, అంతా చిత్రంగా వున్నది! రాజుగారి పిల్లలు అపహరించబడటం, మాయా సరోవరం—అంతా అబద్ధం కాదుగదా?" అన్నాడు జయశీలుడు ఆశ్చర్యపోతూ.

"ముందు వచ్చి గుర్రంమీద కూర్చో. సరోవరం చేరాక, సంగతి సందర్భాలన్నీ నువే గ్రహించగలవు," అన్నాడు మకరకేతు.

జయశీలుడు మారుమాట్లాడకుండా పోయి, మకరకేతు వెనక గుర్రం మీద కూర్చున్నాడు. మాయాసరోవరేశ్వరుడు జలగ్రహాన్ని అదిలించాడు. అది కదిలి వేగంగా నడవసాగింది. దానిని అనుసరించి మకరకేతు గుర్రాన్ని పరిగెత్తించసాగాడు. జయశీలుడికి ఆ సమయంలో సిద్ధసాధకుడు చప్పున జ్ఞాపకం వచ్చాడు. ఎంతోకాలంగా అరణ్యాల్లో తనతోపాటు కష్టాలనుభవించిన సాధకుడు, తాను కనిపించకపోయేసరికి, ఏమనుకుంటాడు? తను మరణించాడని భావించడు గదా? హంసలరథంలో వున్న తన బాల్యమిత్రుడు దేవశర్మ తాను, కాంచనమాలను రక్షించబోయి, పులివాతబడినట్టు శంకించటం జరిగితే!

జయశీలుడు యిలాంటి ఆలోచనల్లో మునిగివున్న సమయంలోనే, ఆశ్వికుల నాయకుడు వీరసేనుడు, సిద్ధసాధకుణ్ణి అరణ్యంలో కనకాక్షరాజు విడిదిచేసి వున్న చోటుకు తీసుకుపోయాడు. రాజు అతణ్ణి గుర్తించి, ఆప్యాయంగా పలకరించి, "నీతోపాటు, నా పిల్లలను వెతికి తెచ్చేందుకు బయలుదేరిన జయశీలుడనే యువకుడెక్కడ? మీరెన్నాళ్ళకూ తిరిగి రాకపోయేసరికి రాజ్యాన్ని మంత్రులకు ఒప్పగించి, నేనే స్వయంగా బయలుదేరి, యీ అరణ్యాలన్నీ గాలిస్తున్నాను," అన్నాడు.

"మహారాజా, యువరాజునూ, యువరాణినీ ఎత్తుకుపోయినవాళ్ళు మాయా సరోవరం అనేచోట నివసించే వింత

మనుషులు. వాళ్లు, నీళ్ళల్లోనూ, నీళ్ళ బయటా కూడా మామూలుగానే జీవించ గలరు. వాళ్ళల్లో కొందరిని పట్టుకున్నాం. వాళ్ళ రాజైన మాయాసరోవరేశ్వరు డనే వాడు ముందు నరభక్షకులకు దొరికి, తరవాత నా చేత చిక్కి, తప్పించుకు పోయాడు. అయినా మునిగిపోయిందేమీ లేదు. అదే మాయాసరోవరంలో మరొక ప్రాంతాన బతికే యీ జలవృక రాక్షసుడు నాకు బంటు అయాడు. ఇతడిద్వారా మనం ఆ సరోవరం ఎక్కడ వున్నదో, తెలుసుకోవచ్చు,'' అన్నాడు.

''అలాగా!'' అంటూ కనకాక్షరాజు, రాతి గదను భుజం మీద పెట్టుకుని, సిద్ధసాధకుడి వెనకగా నిలబడిన జల వృకుడి కేసి చూసి, ''వీడు, నీకు బంటు కాదగినవాడే! మరి, ఆ జయశీలు డేమయ్యాడు?'' అని అడిగాడు.

''అతడు, ఇద్దరు మాయాసరోవరం రాజసేవకులతో కలిసి హంసల రథంలో, ఆ రాజుకోసం అరణ్యంలో గాలిస్తున్నాడు. ఆ రాజు నా కంటబడి పారిపోయిన సంగతి అతడికింకా తెలియదు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

''హంసల రథమా?'' అంటూ రాజు కనకాక్షుడితోపాటు, అతడి ఉద్యోగులంతా ఎక్కడలేని ఆశ్చర్యంపొందారు.



''ఒక్క హంసల రథం ఏమిటి, మహా రాజా? ఈ జలరాక్షసుడేమిటి? ఈ నర వానరం ఏమిటి? ఇంకా—మూడడుగుల ఎత్తయినా లేని మనుషులు, ప్రాణులను పట్టి తినే వృక్షాలు—యిలా, ఒకసారి మనం నగరాలను వదిలి అరణ్యాల్లో ప్రవేశిస్తే, మన కెదురయేవి వింతలుతప్ప మరేం వుండవు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొంచెం దూరంగా వున్న చెట్ల కింద కలకలం బయలుదేరింది. అక్కడ వున్న రాజభటులతో యిద్దరు నరభక్షకులు వాదులాడుతున్నారు. తమకొక గొప్ప రహస్యం తెలుసుననీ, అది చెప్పేందుకు తమను నరవానరాన్ని

ఎక్కి తిరిగే భూతాలరాయుడి వద్దకు తీసుకుపొమ్మనీ అడుగుతున్నారు.

భటులు వాళ్ళను, ''మీరెవరు? ఎక్కణ్ణించి వచ్చారు?'' అని మామూలు ధోరణిలో ప్రశ్నిస్తున్నారు.

సిద్ధసాధకుడు ఒక రాజభటుణ్ణి పంపి, సంగతి తెలుసుకుని, వాళ్ళనిద్దర్నీ తన దగ్గిరకు తీసుకురమ్మన్నాడు. నరభక్షకు లిద్దరూ వస్తూనే సాధకుడికి ప్రాణాచారం పడిలేచి, ''దొరా, మా నాయకుణ్ణీ, గణాచారినీ విడిపిస్తే, మీకు గొప్ప రహస్యం చెపుతాం,'' అన్నారు.

సాధకుడికి వాళ్ళేదో ముఖ్యమైన సంగతి తెలుసుకుని వచ్చారన్న అనుమానం కలిగి, జలవృకభటుడికి, గుర్రాలకు కట్టివున్న నరభక్షకుల్ని విడిపించి తెమ్మని ఆజ్ఞ యిచ్చాడు. వాడు పోయి, బెబ్బులిదొరా, ముసలి గణాచార్ల కట్టుతాళ్ళు విప్పి, యిద్దర్నీ చెరొక చేత్తో ఎత్తిపట్టుకుతెచ్చి, సాధకుడి ముందు నిలబెట్టాడు.

''ఇప్పుడు చెప్పండి, మీకు తెలిసిన రహస్యం ఏమిటి?'' అని అడిగాడు సిద్ధసాధకుడు, నరభక్షకులను.

''భూతాల దొరా, మీ నుంచి పారి పోయిన మొసలి ముఖంవాణ్ణీ, వింత ఏనుగునెక్కి వచ్చినవాణ్ణీ పట్టుకు తినేందుకు అరణ్యంలో వెతుకుతూండగా, వాళ్ళకు మీలాంటి మనిషి, మరొక ఆడపిల్లా తటస్థపడ్డారు. మేము వాళ్లందర్నీ మీదపడి పట్టుకోవటం ప్రమాదమేమో అని సంశయిస్తూ, చెట్లచాటున పొంచి వుండగా, వింత ఏనుగువాడూ, మొసలి ముఖంవాడూ వాళ్ళను తమ వాహనాల మీద ఎక్కించుకుని, కొండల కేసి దౌడు తీశారు. ఇంకో రహస్యం ఏమంటే: హంసలరథంలో నుంచి నేల దిగిన కొందరు మనుషులు, తూర్పు దిక్కున యిక్కడికి ఒక ఆమడ దూరంలో, మధ్య మధ్య కేకలు పెడుతూ, ఎవరికోసమో చెట్లూ, పుట్టలూ గాలిస్తున్నారు,'' అన్నారు నరభక్షకులు. —(ఇంకావుంది)






# నాస్తికుడి దైవభక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఒక మనిషి ఆస్తికుడైనా అవుతాడు, నాస్తికుడైనా అవుతాడు. కాని రెండూ అయిన వింతమనిషి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకానొక నగరంలో రామన్న అనే ఆస్తిపరుడుండేవాడు. ఆయన కష్టాలలో ఉన్నవారికీ, పేదలకూ సహాయపడుతూ దయగలవాడుగా పేరుపొందాడు. అయితే అతను పరమ నాస్తికుడు. అతనికి గుళ్ళలో దేవుళ్ళకు పూజలు చెయ్యటంలో నమ్మకం లేదు. ఇతరులకు చేతనైన సేవ చెయ్యటంలోనే మానవ

## బేతాళ కథలు



జన్మకు సార్థక్యం ఉందని ఆయన గట్టిగా నమ్మేవాడు.

ఒకసారి రామన్న రెండో కొడుక్కు ఏదో వింత రోగం పట్టుకుని, మాట పడిపోయింది. నగరంలోని వైద్యులెవరికీ ఆ రోగం అంతుచిక్కలేదు. రామన్న బంధువులూ, మిత్రులూ కూడా ఏక కంఠంగా, ''నువు నాస్తికుడివి. దేవుడు నిన్ను పరీక్ష చేస్తున్నాడు. అపచారమై పోయిందని లెంపలు వేసుకుని, దేవుడికి మొక్కుకో. నీ కొడుక్కు నయం కావచ్చు,'' అన్నారు.

''నాస్తికుడినైన కారణంగా నేను దేవుడికిగాని, మనిషికిగాని చేసిన అపచారం ఏమీ లేదు. తనను నమ్మని వారిని వేధించేవాడు ఏం దేవుడు? నేను మాత్రం దేవుణ్ణి ఏమీ కోరను,'' అని రామన్న అందరికీ స్పష్టంగా చెప్పేశాడు.

ఈలోగా ఆ దేశంలో ఒక ప్రత్యక్ష దైవం వెలిశాడు. ఆ స్వాములవారు ఎన్నో మహిమలు గలవాడనీ, గుడ్డివాళ్లకు చూపు కూడా తెప్పించాడనీ గోలగా చెప్పుకున్నారు. రామన్న భార్యకు ఆశ కలిగి, ''మనవాణ్ణి ఆ స్వాముల వారికి చూపింతాం, వాడి జబ్బు నయం అవుతుందేమో!'' అన్నది భర్తతో.

''మనిషి దేవుడు కావటమేమిటి? సన్యాసులు రోగాలు నయం చేస్తే ఇంక వైద్యులూ, వైద్యమూ దేనికి? ఇదంతా మోసం. నేను నమ్మను,'' అన్నాడు రామన్న.

తన నమ్మకం ప్రకారం రామన్న తన కొడుకును ఊళ్ళూళ్ళు తిప్పి, అనేక మంది వైద్యులకు చూపాడు. కాని ఫలితం లేకపోయింది.

ఇలా ఉండగా మహాభిషక్కు అనే వైద్యుడు దేశసంచారం చేస్తూ రామన్న ఉండే ఊరు వచ్చాడు. ఆయన ఆ ఊళ్లో పది రోజులు మాత్రమే ఉంటాడనీ, ఆయన కుదర్చలేని రోగం లేదనీ తెలిసి, ఊళ్ళోవాళ్లు మహాభిషక్కుడి దర్శనం

కోసం ఎగబడ్డారు. రామన్న కూడా తన కొడుకును ఆయనకు చూపించాడు. ఆయన కుర్రవాణ్ణి పరీక్షించి, మూడు గుళికలు ఇచ్చి, రోజు కొకటి చొప్పున వెయ్యమన్నాడు.

మొదటి గుళికకే కుర్రవాడి నోరు కాస్త పెగిలి, చిన్న చిన్న ధ్వనులు చేశాడు. రెండో గుళికతోనే వాడికి మాట పూర్తిగా వచ్చేసింది. రామన్న తన కొడుక్కు మూడో గుళిక కూడా వాడినాక మహాభిషక్కును కలుసుకుని, "స్వామీ, తమరు సామాన్యులు కారు. మీ గురించి ఇంతకాలమూ నాకు తెలియకపోవటం నా దురదృష్టం," అన్నాడు.



మహాభిషక్కు నవ్వి, "అయ్యా, నా వద్ద అమోఘమైన ఓషధులున్నాయి. మహిమ అంతా వాటిదే. నా గొప్పతనం ఏమీ లేదు. మామూలు రోగాలు ఎవరైనా నయం చేస్తారు. నా వద్ద అసాధారణ వ్యాధులకు మందులున్నాయి. అందుచేత నేను ఒకేచోట ఉండక, అన్ని ఊళ్ళూ తిరిగి, ఎక్కడెక్కడ మొండి వ్యాధులున్నా నయం చేస్తూ ఉంటాను. వైద్యానికి ప్రతిఫలంగా ఎవరెంత ఇయ్యగలిగితే అంతే పుచ్చుకుంటాను. ఆ డబ్బు నా సంచారానికి అయ్యే ఖర్చుకు పనికి వస్తుంది," అన్నాడు.

రామన్న ఆయనకు వెయ్యి వరహాలిచ్చి, ఆయన కాళ్ళమీదపడి, "స్వామీ, ఇంతకాలమూ భగవంతుడు లేడనుకునే వాణ్ణి. మీరే భగవంతుడు!" అన్నాడు.

మహాభిషక్కు రామన్నను లేవదీసి, "నీకు దేవుడిలో నమ్మకం లేదా? అయితే నువు ప్రత్యక్షదైవం స్వాముల వారిని చూసి ఉండవు. ఆయన దర్శనం చేసుకుంటే నీకు దేవుడిలో తప్పక నమ్మకం కలుగుతుంది. ప్రత్యక్షదైవం ఆయన ఒక్కడే! నే నాయన భక్తుణ్ణి. ఆయన ఆదేశం మీదనే నేను ఇలా దేశ సంచారం చేస్తున్నాను. ఒకసారి ఆయనను చూసిరా," అన్నాడు.

మహాభిషక్కు చెప్పాడు గదా అని రామన్న స్వాములవారిని చూసి వచ్చాడు. అయన భార్య స్వాములవారిని గురించి అడిగింది. ''అయన మనవంటివాడే. ఆయనను దేవుడని ఎందుకనుకుంటు న్నారో తెలీదు. ప్రత్యక్షదైవం అంటే మహాభిషక్కు ఒక్కడే," అన్నాడు రామన్న.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రామన్నను ఆస్తికుడనాలా, నాస్తికు డనాలా? ఎన్నడూ గుడికి వెళ్ళి, దేవుడికి దణ్ణం పెట్టనివాడు మహాభిషక్కులో దేవుణ్ణి ఎందుకు చూడగలిగాడు? తనలో ప్రత్యేకత ఏమీ లేదనీ, ప్రత్యక్షదైవం స్వాములవారే దేవుడు అనీ ఆ మహాభిషక్కే స్వయంగా చెప్పినా, ఆ స్వాములవారిలో దేవుణ్ణి ఎందుకు చూడలేకపోయాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దేవుడికి ప్రమాణాలు లేవు. ఎవరికి దేవుడు ఏ రూపంలో ఎందుకు కనిపిస్తాడో చెప్పలేం. వేరు వేరు మతాలవాళ్ళు ఒకరి దేవుణ్ణి మరొకరు నిరాకరించి, ఇతర మతాల వాళ్ళను నాస్తికులంటారు. రామన్న ఇతరులకు ఉపకారం చేసే గుణం గలవాడు. దేవుడిలో పూర్తి నమ్మకం గలవాడు భారాలన్నీ దేవుడికే వదులుతాడు. అలా చెయ్యని కారణం చేత రామన్న నాస్తికుడు. మహాభిషక్కు దేవుడు చెయ్యలేని పని—మొక్కుబడు లకు కూడా నయంగాని రోగాలను నయం చెయ్యటం—దీక్షగా పెట్టుకున్నాడు గనక రామన్నకు ఆయనలో దేవుడు కని పించాడు. తనను వెతుక్కుంటూ వచ్చే జనానికి ఉపదేశాలు చేసే స్వాముల వారిలో అతనికి మామూలు మనిషే కనిపించాడు. ఇందులో వైరుధ్యం ఏమీ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






ఒక గ్రామంలో శరభుడు అనే పశువుల కాపరి ఉండేవాడు. వాడి ఆస్తి అంతా కలిసి నాలుగు ఆవులు. వాడు వాటిని రోజూ మేతకు తీసుకుపోయి, ఏ చెట్టు మీదనో, గుట్టమీదనో కూర్చుని వేణువు ఊదుకుంటూ కాలక్షేపం చేసేవాడు.

ఒక రోజు వాడు ఒక చెట్టు మీద కూర్చుని వేణు గానంలో నిమగ్నుడై ఉండగా సమీపంలో పులి గాండ్రింపు వినిపించింది. వాడు ఉలికిపడి తన ఆవులు మేస్తున్న దిక్కు చూసి, ఒక అపూర్వ దృశ్యం కంటపడే సరికి, నిర్ఘాంత పోయాడు. శరభుడి ఆవులు నాలుగూ ఒక పెద్దపులిని చుట్టుముట్టి దాన్ని కొమ్ములతో పొడుస్తున్నాయి. పులి వాటి నుంచి తప్పించుకుని పారిపోయి, ప్రాణాలు దక్కించుకుందామని విశ్వ ప్రయత్నం చేస్తున్నది. కాని ఆవులు దానికి సందు ఇయ్యక, చివరకు దాన్ని చంపేశాయి.

శరభుడు తన ఆవుల పౌరుషాన్ని చూసి చాలా గర్వపడ్డాడు. ఆవులు, ఏమీ జరగనట్టుగా, తిరిగి మేత మేయసాగాయి.

తరవాత కొద్ది కాలానికి శరభుడు ఉండే ప్రాంతంలో వానలు పడక, బీళ్ళు ఎండిపోయి, పశువులకు మేత కరువయింది. తిండిలేక పశువులు ఎండిపోతున్నాయి.

తన ఆవులు తిండికి మాడటం చూడలేక, శరభుడు వాటిని తోలుకుంటూ, దూరంగా ఉన్న కొండప్రాంతానికి వెళ్లాడు. అక్కడి బయళ్ళలో గడ్డి చాలా ఏపుగా పెరిగి ఉన్నది. అలాటి మేతను మెయ్యటానికి ఆ ప్రాంతంలో పశువులే లేవా అని ఆశ్చర్యపడుతూ, అక్కడికి అరమైలు దూరంలో ఉన్న ఒక చిన్న గ్రామం చేరి,

బూర్లె నాగేశ్వరరావు



అక్కడ శరభుడు నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

ఆ గ్రామంలో పశువులున్నాయి, కాని వాటికి తిండి పుష్టిలేనట్టు బక్క చిక్కి ఉన్నాయి. "కొండ కింద నవనవలాడే మేత ఉండగా, ఏట్లో ప్రయాణం చేసేవాడు దాహంతో చచ్చినట్టు, మీ పశువులు ఇలా బక్కచిక్కి ఉన్నాయేం?'' అని శరభుడు గ్రామస్థులను అడిగాడు.

''ఏం చెప్పమంటావు? కొండ చుట్టూ ఉన్న బీళ్ళలో పులులూ, సింహాలూ చేరాయి. అక్కడికి మేతకు వెళ్ళిన పశువులు మళ్ళీ కనిపించవు. అందుకని మా పశువులను అటుకేసి పోనియ్యం. నువ్వయినా నీ ఆవులను దగ్గరలో మేపటం మంచిది,'' అన్నారు వాళ్లు.

''నా ఆవులను పులులూ, సింహాలూ ఏమీ చెయ్యలేవు. వాటి సంగతి మీకు తెలియదు,'' అన్నాడు శరభుడు.

''వీడికి ఈ ఆవులు, మరెంతో కాలం దక్కవు!'' అని గ్రామస్థులు తమలోతాము అనుకున్నారు.

అసలు సంగతి ఏమిటంటే, కొండ వెనక ఒక దొంగవెధవ, గంగులు అనే వాడు, ఉన్నాడు. వాడు పులిలాగానూ, సింహంలాగానూ అరవగలడు. గ్రామానికి చెందిన పశువులు కొండ సమీపంలో మేతకు వచ్చినప్పుడు, వాడు గడ్డిలో దాగి పులిలాగా గాండ్రించి, వాటిని గ్రామానికి దూరంగా పారిపోయేటట్టు చేసి, వాటిని కొండచుట్టి తీసుకుపోయి, ఇతర గ్రామాలలో అమ్మి, డబ్బు చేసుకునేవాడు. వాడు పులిలాగా గాండ్రించటమూ, సింహంలాగా గర్జించటమూ పశువుల కాపర్లకు వినిపించి, వాళ్ళు గ్రామంకేసి పారిపోయేవారు. ఇలా చాలా పశువులను పోగొట్టుకున్న మీదట పశువులను కొండ కేసి తోలుకు పోవటానికి ఎవరూ సాహసించలేకపోయారు.

ఈ సంగతి శరభుడికి కూడా తెలీదు. వాడికి తెలిసినదెల్లా తన ఆవులు పులు

లకూ, సింహాలకూ భయపడవని మాత్రమే.

చాలా రోజులుగా దొంగిలించటానికి పశువులు దొరకక ఇబ్బంది పడుతున్న దొంగ గంగులు ఒకనాడు శరభుడి అవులను చూశాడు. అవి బాగా బలిసి ఉన్నాయి. వాటి యజమాని శరభుడు ఒక చెట్టు మొదట్లోచేరి, నిశ్చింతగా వేణువు వాయించుకుంటూ వాడికి కనిపించాడు.

గంగులు ఆ ఆవులను కాజెయ్యటానికి నిశ్చయించుకుని, తాను ఏ పొదల మధ్య దాక్కుంటే పని జరుగుతుందో జాగ్రత్తగా చూసుకుని, మర్నాడు పశువులకన్న ముందుగా వచ్చి, పొదలో కూర్చున్నాడు.

శరభుడి ఆవులు ఆ ప్రాంతానికి వచ్చి మేయసాగాయి. శరభుడు వేణువు వాయించటం ప్రారంభించాడు. కొంత సేపు గడిచాక వాడికి పెద్దపులి గాండ్రింపు వినిపించింది. అటే కంగారుపడకుండానే వాడు తన పశువుల కోసం చూశాడు. వాడు అనుకున్నట్టే అవి ఒక పొదకు నాలుగుపక్కలా చేరి, తలలు వంచి, పొదలో నుంచి పులి వచ్చిన మరుక్షణం దాన్ని కుమ్మీ, పొడిచీ, చంపటానికి సిద్ధంగా ఉన్నాయి. శరభుడు వాయింపు కట్టిపెట్టి వింత చూస్తూ ఉండిపోయాడు.




ఈ లోపల గంగులుకు విచిత్రమైన అనుభవం కలగసాగింది. తన అరుపు విని అవులు బెదిరి పారి పోకపోగా, తాను ఆహ్వానించినట్టుగా పొద దగ్గిరికి వచ్చాయి. వాటికి పులి అంటే భయం తెలియదు కాబోలు ననుకుని, సింహంలాగా గర్జించాడు. అవులు ఆ గర్జన విని భయపడక పోగా, బుసలు కొట్టుతూ, గిట్టలతో నేలను గీరి, "దమ్ముంటే ఉంటే భయటికిరా! నీ ప్రాణం తీస్తాం!" అన్న ధోరణిలో కనిపించాయి.

తనకు అవులు దక్కకపోగా, తన ప్రాణానికే ప్రమాదం వచ్చిందని గంగులు తెలుసుకునేటందుకు కొంత వ్యవధి

పట్టింది. ఆ తరవాత వాడికి ముచ్చెమటలు పోశాయి. వాడు కాస్సేపు పులిలాగా, కాస్సేపు సింహంలాగా మార్చి, మార్చి అరవసాగాడు. అందువల్ల వాడికి ఏమీ ప్రయోజనం కలగకపోగా, ఆవులు మరింత పెద్దగా బుసలు కొట్టసాగాయి.

అయితే ఆ అరుపులు విని గ్రామం పరిసరాలలో మేస్తున్న పశువులు బెదిరి, అన్ని దిక్కులా పారి పోసాగాయి. కట్టేసి ఉన్న పశువులు కట్టుతాళ్ళు తెంచుకుని మరీ పారిపోయాయి.

ఊరి మనుషులు వాటికోసం అటూ ఇటూ పరిగెత్తసాగారు. ఇంతలో శరభుడు గ్రామం కేసి పరిగెత్తుకుంటూ వచ్చి, "నా ఆవులు పులినీ, సింహాన్నీ పట్టాయి! చూతురుగాని రండి!" అంటూ కొంత మందిని తీసుకుపోయాడు. వాళ్లు ప్రాణాలు అరచేత పట్టుకుని శరభుడి వెంట వెళ్ళారు.

తన ఆవులు చుట్టిముట్టి ఉన్న పొదకు సమీపంలో శరభుడు ఆగగానే, ఊరి వాళ్ళు ఆశ్చర్యంగా, "ఏదీ పులి?" అని అడిగారు.

"అది ఒకంతట బయటికి వస్తుందా! నా ఆవులు చీల్చేయ్యవూ? మీరంతా ఆ పొద మీదికి రాళ్లు విసరండి. పులిలాగానూ, సింహంలాగానూ అరవగల జంతువు బయటికి వస్తుంది!" అన్నాడు శరభుడు.

నలుగురూ బలంగా రాళ్ళు విసరటం ప్రారంభించగానే శరభుడి ఆవులు పొద నుంచి ఇవతలికి వచ్చేశాయి. తలకూ, ఒంటికీ గాయాలుతగిలి, రక్తం కారుతూన్న దొంగ గంగులు చావుకేకలు పెడుతూ పొదలో నుంచి వచ్చి, మనుషుల కాళ్ళ మీద పడ్డాడు.

తమ పశువులను దొంగిలించినవాడు వాడేనని తెలియగానే గ్రామస్థులు వాణ్ణి కొనప్రాణంతో వదిలేశారు. అది మొదలు శరభుడు ఆ గ్రామానికి నాయకుడయాడు. గ్రామంలో పశువులు కొండ కింది బీళ్ళలో మేసి, చక్కగా బలిశాయి.



# ఉపదేశం

జయరాం చాలా ఆస్తిపరుడు. అతని దగ్గిర కొకనాడు ఒక యాచకుడు వచ్చాడు. యాచకుణ్ణి చూసిన జయరాం అత నెందుకొచ్చాడో గ్రహించి, "వచ్చారా? రండి, రండి!" అన్నాడు. జయరాం తనకేదో బాగా ముట్టచెబుతాడని యాచకుడు పొంగిపోయాడు.

జయరాం, యాచకుడితో, "ఈ బంగళాను రెండులక్షలు పెట్టి కట్టించాను," అన్నాడు.

"చాలా బాగుందండీ," అన్నాడు యాచకుడు. తర్వాత జయరాం, యాచకుణ్ణి బంగళా అంతా తిప్పుతూ, ఒక గదిలోవున్న ఇనప్పెట్టే అందులోవున్న బంగారు నగలూ, మరొకగదిలో వున్న వెండి సామానూ, ఇంకొక గదిలోవున్న ధాన్యం బస్తాలూ, కొత్తఫర్నీచరూ చూపించాడు.

"లక్ష్మీపుత్రులంటే మీరేనండి!" అన్నాడు, అన్నిటినీ చూసిన యాచకుడు.

తర్వాత జయరాం అతణ్ణి పెరట్లోకి తీసికెళ్ళి, "ఈ అస్తంతా నేను కష్టపడి సంపాదించింది గాని, ఒకర్ని యాచించింది కాదు," అని పెరటి తలుపు తీసి, "ఈ త్రోవంట మీరు వెళ్ళవచ్చు," అన్నాడు.

యాచకుడు మారు మాట్లాడకుండా ఆ త్రోవంట పోయాడు. —భైరి సత్యనారాయణ






రామాపురం జమీందారు పిసినికొట్టు మాత్రమే గాక, పదిమందితో కలిసి వచ్చే మనిషి కూడా కాదు. ఆయన భార్య అందుకు పూర్తిగా వ్యతిరేకం. ఆవిడకు భగవద్భక్తి కూడా జాస్తి.

ఒకసారి ఊళ్లో వాళ్లు రామాలయాన్ని అభివృద్ధి చెయ్యటానికీ, శ్రీరామనవమి ఉత్సవాలు పెద్ద ఎత్తున జరపటానికీ చందాలు పోగుచేయాలని నిర్ణయించారు. అందుచేత అలయ ధర్మకర్తలు ముందుగా జమీందారుగారి ఇంటికి వెళ్ళారు. జమీందారు చందా ఇస్తాడని వాళ్ళకు నమ్మకం లేకపోయినా దేవుడి కార్యం గనక జమీందారుగారి భార్య ఆయనచేత ఇప్పిస్తుందని వాళ్ళు ఆశపడ్డారు.

వాళ్ళు చందా అడగగానే జమీందారు కుండపగలేసినట్టు ఇయ్యనని చెప్పకుండా, ''చందా కేం భాగ్యం? అందరి దగ్గిరా వసూలుచేసి చివరకు నా దగ్గిరికి రండి,'' అన్నాడు.

''తమరు ముందు ఇచ్చారంటే ఇక ఎవరూ అడ్డు చెప్పరు. అందుచేత తమ చేత మొదట వేయించాలని ఆశతో వచ్చాం,'' అన్నారు కార్యకర్తలు.

జమీందారు ఇరుకునపడి, ''సరే, నా చందా వెయ్యిరూపాయలు రాసుకోండి. అయితే అది ఇప్పుడు ఇయ్యటంపడదు,'' అన్నాడు.

''అలాగే, బాబూ. తమరిమాట చాలు! సాయంత్రం తమరు ఒకసారి రచ్చబండ వద్దకు రావాలి. అక్కడ అందరినీ సమావేశపరచి, చందాల విషయం చర్చించాలనుకుంటున్నాం. తమరు వెయ్యి రూపాయలూ ఇచ్చినట్టు అందరి సమక్షంలో చెబుతాం. ఆ తరవాత ఎవరూ కాదనరు,'' అన్నారు కార్యకర్తలు.

బొమ్మిడి అచ్చారావు

జమీందారు సంతోషంగా ఒప్పు కున్నాడు. వాళ్ళమాటలను బట్టి తాను నిజంగా డబ్బు ఇవ్వనవసరం ఉండదని అయనకు తోచింది.

తరవాత కార్యకర్తలు జమీందారు గారి భార్యను కలిసి, సంగతి చెప్పారు. తన భర్త మాటలవాడే గాని చేతలవాడు కాడని ఆమెకు తెలుసు. అందుచేత ఆమె వాళ్ళతో, "ఆ వెయ్యి రూపాయలూ నేనిస్తాను. మీరు మళ్ళీ ఆయనను అడగ కండి," అన్నది.

"అమ్మా, మీ సంగతి మాకు తెలి యదా? కాని బాబుగారు అందరి సమక్షం లోనూ డబ్బు ఇస్తే తప్ప మిగిలినవాళ్ళ నుంచి చందాలు చురుకుగా రావు. అందుకే వారిని రచ్చబండ దగ్గిరకు రమ్మన్నాం," అన్నారు కార్యకర్తలు.

ఆమె కొంచెం ఆలోచించి, "సరే, సాయంత్రం రచ్చబండ వద్ద వారే స్వయంగా వెయ్యి రూపాయలూ మీకిచ్చే టట్టు చూస్తాను. వెళ్ళిరండి," అన్నదామె, వారికి ఒక పథకం చెప్పి.

ఆ సాయంకాలం రచ్చబండవద్ద జమీందారుగారి అధ్యక్షతన సమావేశం జరిగింది. జమీందారుగారు వెయ్యి రూపాయలు చందా ఇయ్యటానికి అంగీక రించినట్టు సభాముఖంగా కార్యకర్తలు ప్రకటించి, జమీందారుతో, "ఈ కార్య క్రమం ప్రథమంగా తమ చందాతో ప్రారంభించండి," అన్నారు.



అంతమందిలో వాళ్లు తనను చందా ఇయ్యమని అడుగుతారని జమీందారు ఊహించక కొంచెం కంగారుపడి, "సరే, ఇంటికి వచ్చి తీసుకు వెళ్లండి," అన్నాడు బింకంగా.

"దానికేమండీ! తమ చేతిమీదుగా జేబులో ఉన్నంత వేసి చందాలకు బోణీ చెయ్యండి. తమరు యివ్వాలనుకున్న మిగతాది తీరికగా ఇయ్యవచ్చు," అన్నారు కార్యకర్తలు.

తన జేబులో పదిరూపాయలు మించి ఉండవని జమీందారుకు తెలుసును. ఆ పదీ ఇచ్చి పీడవదిలించుకుందామని ఆయన జేబులో చెయ్యి పెట్టాడు. చేతికి ఏదో కాగితాల బొత్తి తగిలింది. ఆశ్చర్య పడుతూ, అప్రయత్నంగా ఆయన వాటిని పైకి తీశాడు. అన్నీ నూరురూపాయల కాగితాలు! ఎంచి చూస్తే సరిగా పదే ఉన్నాయి.

"బాబుగారు డబ్బంతా ఇచ్చేస్తున్నా రన్నమాట! దొరగారిది ఎలాగయినా దొడ్డ చెయ్యి!" అంటూ కార్యకర్తలు గట్టిగా అరిచి, పెద్దగా చప్పట్లుకొట్టి, సభలో ఉన్నవారందరిచేతా చప్పట్లు కొట్టించారు.

జమీందారు సంకటస్థితిలోపడి, వెయ్యి రూపాయలూ వాళ్ళ చేతిలో పెట్టాడు. తరవాత చందాలవసూలు కార్యక్రమం ఉత్సాహంగా సాగింది.

జమీందారు రచ్చబండ నుంచి తిన్నగా ఇంటికిపోయి, తన భార్యను, "నా జేబులోకి, పది నూరు రూపాయిల కాగితాలు ఎలా వచ్చాయి? నువుగాని పెట్టలేదు గదా?" అని అడిగాడు.

"అరెరే, మీకు చెబుదామనుకుంటూనే మర్చిపోయాను, చూశారా! ఇందాక రైతులు ధాన్యం తాలూకు డబ్బు వెయ్యిరూపాయలు తెస్తే, వాటిని మీ జేబులో పెట్టాను. పని తొందరలో ఆ సంగతి మళ్లీ జ్ఞాపకం రాలేదు. డబ్బు సరిగా ఉన్నది గదా?" అని అడిగింది, జమీందారు భార్య.



# పారనిపథకం

ఒక ధనికుడు ఒక స్వర్ణకారుడి వద్ద నగలు చేయించటానికి కొంత డబ్బు ఇచ్చాడు. నగలు తయారయాయి. ధనికుడు అతడికి ఇంకా ఎనిమిది వందలు ఇవ్వవలసి వచ్చింది. "వచ్చే మంగళవారంనాడు నా తమ్ముడితో ఎనిమిది వందలూ పంపుతాను. మీరు అతనికి నగలిచ్చి పంపండి," అని ఆయన అన్నాడు. "మీ తమ్ముణ్ణి నేనెరగను," అన్నాడు స్వర్ణకారుడు. "డబ్బు తెస్తాడుగదా? అదే మీకు గుర్తు," అన్నాడు ధనికుడు.

ఈ సంభాషణ విన్న ఒక మోసగాడు మంగళవారం ఉదయమే ఎనిమిది వందలు తెచ్చి స్వర్ణకారుడికి ఇచ్చి, నగలు అడిగాడు. అయితే ధనికుడు సోమవారం సాయంకాలమే డబ్బు ఇచ్చి నగలు పట్టుకు పోయినందున స్వర్ణకారుడికి మోసం అర్థమయింది.

అతను ఎనిమిది వందలూ తీసుకుని, లోపల ఉన్న గిల్టునగలు కొన్ని తెచ్చి మోసగాడికి ఇచ్చి పంపేశాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్.






రూపరాం అనే రాజు అన్నివిధాలా యోగ్యుడేగాని, అతనికి మూఢ విశ్వాసాలు జాస్తి. అతని మూఢ విశ్వాసాల వల్ల ఇతరులు ఒక్కొక్కసారి తీవ్ర సంకటాలకు గురికావలసి వచ్చేది.

ఒకరోజు వేకువఝామున ఆయనకొక పీడ కల వచ్చింది. అందులో ఆయనకు అగ్నిదేవుడు కనిపించి, తీవ్రంగా రాజభవనం కేసి చూసేసరికి, రాజభవనం గుప్పుమంటూ అంటుకుని, భగభగా మండసాగింది.

"నిప్పు! మంటలు! రక్షించండి! రక్షించండి!" అని రాజు పెట్టిన కేకలకు అందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. మొదట రాజుకు వాళ్ళంతా ఎందుకు వచ్చినదీ అర్థం కాలేదు. ఆయన కేకలు పెట్టిన సంగతి వాళ్ళు చెప్పిన మీదట ఆయనకు తన పీడ కల గుర్తువచ్చింది. ఆయన తన మంత్రి, పురోహితులతో కలను గురించి చెబితే, "దాన్ని లక్ష్యపెట్టనవసరంలేదు," అన్నారు.

"తెల్లవారుఝామున వచ్చిన కల తప్పక నిజమవుతుంది! ఉపేక్షించరాదు!" అని రాజు రాజభవనంలో ఎక్కడా నిప్పు రాజటానికి వీల్లేదనీ, దీపాలు వెలగరాదనీ ఉత్తరువు జారీ చేశాడు.

రాజభవనంలో వారి భోజనం బయట ఎక్కడో తయారై వచ్చేది. అందుచేత వేడివేడిగా భోజనం చేసే గీత రాజుకూ, రాణికీ కూడా లేకుండా పోయింది. రాత్రి పూట రాజభవనమంతా గాఢాంధకారంలో మునిగి ఉండటం చేత అటూ ఇటూ తిరిగే వాళ్ళకు ఎదురు దెబ్బలూ, అవయవాలు బెణకటమూ తరచు జరగసాగింది.

---

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

ఈ దుర్దశనుంచి రాజభవనాన్నీ, అందులో ఉండేవారినీ ఎలా కాపాడట మన్నది సభికులకు పెద్ద సమస్య అయి కూర్చున్నది. ఆస్థాన ఇంద్రజాలికుడు సోమనాధుడు ఒక రోజు ఆస్థాన పురోహి తుణ్ణి కలుసుకుని, తన పథకం ఇలా చెప్పాడు:

"పరేశుడని నాకొక పినతండ్రి మరొక రాజ్యంలో ఉన్నాడు. ఆయనా ఇంద్ర జాలికుడే. అగ్నిని వశం చేసుకున్నవాడని చెప్పి ఆయనను రాజుగారికి పరిచయం చేసి, ఇంద్రజాలం ద్వారా ఆ మాట నిరూపించి, రాజుగారికి నమ్మకం కలి గించి, రాజభవనంలో అగ్ని భయం లేకుండా కట్టుదిట్టాలు చేయిస్తాం."

సోమనాధుడి పథకం ప్రకారం పరేశుడు దివాణంలో హాజరు అయాడు. అప్పటికే ఆస్థాన పురోహితుడు రాజుకు పరేశుడి అగ్ని వశీకరణ శక్తి గురించి చెప్పి ఉన్నాడు. ఆ శక్తిని నిరూపించటానికి ఉపక్రమించాడు పరేశుడు. ఆయన తన సంచీనుంచి ఒక గాజుచిమ్నీ తీశాడు. దానిపై భాగం రెండు అంగుళాల వ్యాసం కలిగి ఉన్నది. బల్లమీద ఒక కొవ్వొత్తి వెలిగించి పెట్టి, దాని మీద చిమ్నీ ఉంచాడు. కొవ్వొత్తి కొద్దిసేపు మాత్రం వెలిగి ఆరిపోయింది. చిమ్నీ తీసి, కొవ్వొత్తి మళ్లీ వెలిగించి, మళ్ళీ చిమ్నీ యథా స్థానంలో ఉంచితే, కొవ్వొత్తి మళ్ళీ ఆరి పోయింది.





# కండసిరి

చీనాలో హుయాంగ్‌హో నదీ ప్రాంతంలో ఉన్న ఒక చిన్న బొగ్గుగనిలో పింగ్, చిన్ అనే కార్మికులిద్దరు బొగ్గు తవ్వి, పట్టణంలో అమ్ముకొని జీవిస్తున్నారు.

ఒకనాడు వాళ్ళు గనిలో చెరొకపక్కా పనిచేస్తుండగా, పెద్ద బొగ్గుపెళ్ళ విరిగి పింగ్ కాళ్ళమీద పడింది. పింగ్ కాళ్ళు రెండూ చితికిపోయాయి.

చిన్ అతన్ని భుజానికి ఎత్తుకుని, పట్నం చేర్చి, చికిత్స చేయించాడు. పింగ్ కాళ్లు రెండూ నరికి కట్టుకట్టారు. పింగ్ కుంటివాడయ్యాడు. అతనికి పూట గడవడం అసాధ్యమయింది.

ఒకనాడు అతను చిన్‌తో, "నన్ను ఒకసారి గనికి తీసుకువెళ్ళు. నన్ను ఇలా కటిక దరిద్రుణ్ణి చెయ్యడానికి కారణ మేమిటో గని దేవతను అడుగుతాను," అన్నాడు.

చిన్ అతన్ని గనిలోకి చేర్చాడు. పింగ్ నేలమీద చతికిలబడి, బిగ్గరగా, "అమ్మా, గనిదేవతా! నేనూ, నా భార్యా ఎలా బతకాలి?" అన్నాడు.

గని లోపలినుంచి ఏ సమాధానమూ రాలేదు. కాని అకస్మాత్తుగా పింగ్ సమీపంలో చిన్నమూట పడింది. పింగ్ దాన్ని విప్పిచూస్తే, అందులో బంగారు కాసులున్నాయి.

అంతవరకు పింగ్ పట్ల సానుభూతి ఉన్న చిన్ అసూయతో దహించుకుపోయాడు. పింగ్‌కు కాళ్ళు పోతే పోయాయిగాని, శ్రమపడకుండా జీవించే మార్గం దొరికింది.

మర్నాడు చిన్ గనిలోకి వెడుతూనే పారను కిందపడేసి, "తల్లీ, గనిదేవతా! నా జీవితం సుఖంగా జరిగిపోయేటట్టు చూడు," అంటూ అరవసాగాడు.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

చిన్ ఎదుట, గనిదేవత ప్రత్యక్షమై, "చిన్, నీకేం లోటు? కష్టపడి బ్రతికే సామర్థ్యం ఉన్నది గదా నీకు?" అన్నది.

"ఎంతకాలం ఇలా కష్టపడగలను, తల్లీ? నాక్కూడా ఏదన్నా నిధి లభించే లాగా చెయ్యి," అన్నాడు చిన్.

"పింగ్ లాగా నువు కూడా ఏమైనా నష్టపోగలవా?" అని దేవత అడిగింది.

చిన్ అందుకు ఒప్పుకున్నాడు.

"అయితే ఇంటికి వెళ్ళు. నీ కొడుకు కేసి తేరిపారచూడు. వాడికి ఎక్కిళ్ళ తెరలు మొదలవుతాయి. తొమ్మిదో ఎక్కిళ్ళ తరవాత వాడు నీ కొడుకు కాడు. వాణ్ణి తెచ్చి నా కప్పగించు," అన్నది దేవత..

చిన్‌కు ఇంకా సంతానం కలగవచ్చు గాని, ధనరాసులు వచ్చే మార్గం ఇది తప్ప లేదు. చిన్ ఇంటికి వచ్చేసరికి, అతడి నాలుగేళ్ళ కొడుకు వీధిలో ఆడుకుంటున్నాడు. చిన్ వాణ్ణి దగ్గిరికి పిలిచి, వాడి కేసి తేరిపార చూశాడు.

చిన్ కొడుక్కు ఎక్కిళ్ళు రాసాగాయి. అయిదు తెరలు పూర్తి అయేసరికి తన కొడుకు మొహంలో మేలిమి బంగారు ఛాయ రావడం చిన్ గమనించాడు. తన కొడుకు కూడా తనకు నిధిలాటివాడేనన్న అభిప్రాయం చిన్‌కు కలిగింది. చిన్ వాడి కేసి చూడడం మాని, గని కేసి పరుగెత్తాడు.

చిన్ కొడుకు ఎక్కిళ్ళు మాని మళ్లీ ఆడుకోసాగాడు.

చిన్‌ను చూసి గనిదేవత నవ్వి, "నీకు సంపద కలిగించే సామర్థ్యం నాకుంటే, పింగ్ కాళ్ళు విరిగిపోకుండా చూడలేక పోయానా? ఎవడో ఈ గనిని సంవత్సరం పాటు ప్రభుత్వం నుంచి గుత్తకు తీసుకునేవాడు, నాకు లంచంగా, ఆ డబ్బు మూట విసిరాడు. పింగ్ ప్రాప్తం అది! చిన్, నీ కండల్లోనే నిధి ఉన్నది. బంగారంలాటి నీ కొడుకు ముసలితనంలో నిన్ను ఆదుకుంటాడు," అని అదృశ్యమయింది.



# ఇద్దరూ ఇద్దరే

కోటిగాడు వీధి వెంట పోతూండగా వాడికి కోయిలకూత వినపడింది. అది పక్కవీధిలో ఉన్న మర్రిచెట్టు మీదినుంచి కూసిందని వాడు గ్రహించాడు.

వెంటనే కోటిగాడికి ఆ కోయిలను కవ్వించాలని బుద్ధిపుట్టి, కోయిలలాగే తానూ కూశాడు. అప్పుడు కోయిల మరింత గట్టిగా కూసింది. కోటిగాడు దానితో పోటీపడి ఇంకా గట్టిగా కూశాడు. కోటిగాడు గొంతు ఎండిపోయినదాకా కోయిలను కవ్వించి, ఇక తనవల్లకాక, విరమించుకుని, ముందుకు సాగిపోయాడు.

వీధి చివర వాడి మిత్రుడు బాలిగాడు కనిపించాడు. కోటిగాడు వాడితో తాను కోయిలను చాలాసేపు ఎలా ఏడిపించినదీ చెప్పుకున్నాడు. అది విని బాలిగాడు, "ఏం పని చేశావురా, కోటిగా? నీ కూతలు విని నిజంగా కోయిలే అనుకుని, ఆ మర్రిచెట్టు దగ్గిరనుంచి కూసింది నేనే!" అన్నాడు.

—ఎం. ఎస్. సుభాని.





# బ్రతకలేని బడిపంతులు

హారూన్ అల్ రషీద్ బాగ్దాదును పరి పాలించే కాలంలో ఒక బడిపంతులు ఉండేవాడు. అతని వద్ద ఇరవై నలుగురు కుర్రవాళ్ళు చదువుకునే వారు. ఈ బడి పంతులు చాలా కఠినుడు. సాయంత్రం అయినా పిల్లలకు ఆటవిడుపు ఇయ్యక, సూర్యాస్తమానం అయిన గంట దాకా చదివించి, అప్పుడు ఇళ్ళకు పోనిచ్చేవాడు. ఈ కాఠిన్యమే బడిపంతులు కష్టాలకు కారణమయింది.

ఒకరోజు పంతులు పాఠాలు ప్రారంభించబోతూ ఉండగా ఇరవై నలుగురు విద్యార్థులూ ఒక్కపెట్టున లేచినిలబడి, "పంతులుగారూ, ఇవాళ మీ మొహం అలా పచ్చగా ఉందేమిటి?" అని అడిగారు.

బడిపంతులు వాళ్ళ మాటలు పట్టించుకోలేదు. ఎందుచేతనంటే అతనికి ఒంట్లో జబ్బుగా ఉన్నట్టు అనిపించలేదు. అతను పిల్లలను, "పాఠాలు చదవండి, వెధవల్లారా!" అని కసిరాడు.

కాని విద్యార్థులలో పెద్దవాడు పంతుల్ని సమీపించి, ఆదుర్దాగా, "అల్లా తోడు, పంతులుగారూ! మీ మొహం చాలా పచ్చగా ఉన్నది. మీకు ఒంట్లో బాగాలేకపోతే, బడి సంగతి నేను చూసుకుంటాను," అన్నాడు.

మిగిలిన పిల్లలు కూడా తమ పంతులు బతుకుతాడో, లేదో అన్నంత ఆదుర్దా తమ ముఖాలలో కనబరిచారు.

అది చూసిన మీదట పంతులుకు తాను నిజంగా జబ్బుగా ఉన్నానేమోననీ, వ్యాధిలక్షణాలు పైకి కనబడని జబ్బులు మరింత ప్రమాదఘనీ అనిపించింది. అతను వెంటనే కూర్చున్న చోటినుంచి లేచి, బడిని పెద్దవిద్యార్థికి అప్పగించి,

ఇంట్లోకి పోయి పడుకుని, తన భార్యను పచ్చకామెర్లకు ఏదన్నా కషాయం కాచి ఇయ్యమన్నాడు.

కొద్దిసేపట్లో పెద్ద విద్యార్థి వచ్చి, ఇరవైనాలుగుదిరహములు తెచ్చి పంతులు కిస్తూ, "పంతులుగారూ, మీ శిష్యులు మీ చికిత్సకోసం చందా వేసుకుని ఈ డబ్బు ఇచ్చారు," అన్నాడు.

ఈమాట విని పంతులు, విద్యార్థుల పైన ఎక్కడలేని వాత్సల్యమూ పుట్టు కొచ్చి, వాళ్ళకు ఆ రోజు ఆటవిడుపు ఇచ్చేశాడు. ఇందుకే విద్యార్థులు చందా వేసుకున్నారనీ తనకు లేని వ్యాధి వున్నట్టు చెప్పి, నమ్మించారనీ, పంతులు గ్రహించలేకపోయాడు.

పంతులుకు డబ్బును చూసి ఆనందం కలిగినా, తన జబ్బు గురించి బెంగపట్టు కున్నది. అందుకు తగ్గట్టే, పెద్దవిద్యార్థి మర్నాడు ఉదయం వచ్చి, బిక్కముఖంతో, "అల్లా మిమ్మల్ని కాపాడాలి! ఇవాళ మీ మొహం మరింత పచ్చగా కనబడు తున్నది," అన్నాడు.

పంతులు ఈ మాట విన్నాక శ్రద్ధగా చికిత్సపొందాలనీ, అందుకోసం పిల్ల లిచ్చిన డబ్బు ఖర్చుచేయాలనీ నిశ్చ యించుకున్నాడు. అతను పెద్దవిద్యార్థితో, "బడి నువే చూసుకో," అని, వాణ్ణి పంపేశాడు.

ఇలా ఒక వారం గడిచింది. పెద్ద విద్యార్థి మరొకసారి విద్యార్థుల చందా



మరో ఇరవైనాలుగు దిరహములు తెచ్చి, "ఇవి మీ చికిత్స కోసం మన విద్యార్థులు పోగుచేసి ఇచ్చారు. శ్రద్ధగా చికిత్స చేయించుకోండి," అన్నాడు.

పంతులు పరమానంద భరితుడయాడు. తనకు ఏ రోగమూ లేదని అతనికి ఈ పాటికి తెలిసిపోయింది. అయితేనేం? కష్టపడి చదువు చెప్పిన దానికంటె, పిల్లల చందా డబ్బులు పుచ్చుకోవటమే అతనికి గిట్టుబాటుగా ఉన్నది! ఇలా ఎంతకాలం సాగితే అంత మంచిదనుకున్నాడు ఫంతులు.

పెద్ద విద్యార్థి తనను చూడవచ్చినప్పుడల్లా పంతులు, తనకు అన్న హితవు బొత్తిగా లేకుండా పోయిందనీ, అమిత నిస్సారంగా ఉంటున్నదనీ చెబుతూ వచ్చాడు.

దురదృష్టవశాన, ఒకనాడు పంతులు ఉడకబెట్టిన గుడ్డు అరగించబోతూండగా పెద్ద విద్యార్థి వచ్చాడు. వాణ్ణి చూస్తూనే పంతులు వేడివేడి గుడ్డును నోట వేసేసుకున్నాడు. అతని నోరంతా కాలి బొబ్బలెక్కింది.

విద్యార్థి వెధవ లౌక్యంగా వెళ్ళిపోవటానికి మారుగా, పంతులు కేసి చూసి, ఆదుర్దాగా, "అయ్యో, మీ చెక్కిళ్ళు వాచిపోయాయండీ! ఏదో కణితిలాగుంది," అన్నాడు.

అసలే బాధతో సతమతమవుతున్న పంతులు ఏమీ అనే స్థితిలో లేడు. అందుచేత విద్యార్థే మళ్ళీ, "దాన్ని పొడిపించాలి! పొడిపించాలి!" అంటూ పెద్ద దబ్బనం చేతబట్టుకుని పంతులు మీదికి వచ్చాడు.

పంతులు చివాలున లేచి వంట ఇంట్లోకి పారిపోయి, నోట్లో ఉన్న గుడ్డును ఊసేశాడు. అయితే అప్పటికే నోరంతా కాలి, బొబ్బలెక్కి, వ్రణం మాదిరిగా తయారయింది. తరవాత ఆయన మంగలిని పిలిపించి, చాలా డబ్బు యిచ్చుకుని, శస్త్రచికిత్స కూడా చేయించుకోవలసి వచ్చింది.





# దొరికిన దొంగ

గరుడరాజ్యం సిరిసంపదలతో తులతూగుతూ, అక్కడి ప్రజలు నిశ్చింతగా బతుకుతూన్న కాలంలో అక్కడ నాగన్న అనే గజదొంగ అవతరించి, ఎడాపెడా దోపిడీలు చెయ్యసాగాడు. వాణ్ణి పట్టుకునేటందుకు రాజు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

రాజు నాగన్న జాడ తెలిపినవారికీ, అతన్ని వర్ణించినవారికీ బహుమానాలిస్తానన్నాడు. కాని రాజుకు కనీసం ఆపాటి వార్త అయినా అందలేదు. ఆ స్థితిలో మంత్రి రామవర్మ, తాను నాగన్నను రెండు రోజులలో పట్టి ఇస్తానని రాజుకు మాట ఇచ్చాడు. అన్నివేలమంది భటులూ, చారులూ చేయలేనిపని తన మంత్రి చేస్తాననేసరికి రాజు ఆశ్చర్యపోయాడు.

రెండు రోజులు గడిచాయి. రెండో రోజు రాత్రి మంత్రీ, మరి నలుగురు మనుషులూ ఒక బలిష్ఠుడైన మనిషిని తాళ్ళతో బంధించి, రాజు వద్దకు తెచ్చి, నిలబెట్టారు.

''ఎవడు వీడు?'' అని రాజు మంత్రిని అడిగాడు.

''మహారాజా, వీడే గజదొంగ నాగన్న. వీడి సాహసం, అహంకారం తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతున్నది. వీడు మా ఇంట దొంగతనం చెయ్యటానికి వచ్చి పట్టుబడ్డాడు. వీణ్ణి తెల్లవారినదాకా రాజగృహంలోనే నిర్బంధించి ఉంచండి. రేపు బహిరంగ విచారణ జరుపుదాం,'' అన్నాడు మంత్రి.

మర్నాడు తెల్లవారింది. గజదొంగ నాగన్న పట్టుబడినవార్త దేశమంతటా కార్చిచ్చులాగా పాకింది. వాడి విచారణ చూడటానికి ఎక్కడెక్కడినుంచో జనం గుంపులు గుంపులుగా వచ్చారు.

పి. వి. ఎస్. ఎస్. ఎన్. రాజు

విచారణ అట్టే సేపు పట్టలేదు. రాజు అడిగినదే తడవుగా తాను గజదొంగననీ, రాజ్యంలో ఎన్నో దోపిడీలు చేశాననీ, నాగన్న ఒప్పుకున్నాడు.

"ఈ దుష్టుడికి ఏమి శిక్ష విధించాలి?" అని రాజు పౌరులను అడిగాడు.

కొందరు పౌరులు వాడి తల నరక మన్నారు. కొందరు వాణ్ణి ఉరి తీయ మన్నారు. కొందరు కొరతవెయ్యటమే, ఆ దుష్టుడికి తగిన శిక్ష అన్నారు.

అప్పుడు మంత్రి రామవర్మ రాజుతో, "మహారాజా, వీడి వల్ల మనం చాలా నష్టపోయాం. వీణ్ణి చంపేస్తే మనకు లాభం కలగదు. వీడి వల్ల మనకు లాభం కలగాలంటే వీడికి దేశబహిష్కరణ శిక్ష వెయ్యటం మంచిది. అలా చెయ్యటం వల్ల వీడు మన పొరుగు దేశాలకు పోయి, అక్కడ, తన దోపిడీలతో అరాజకం సృష్టిస్తాడు. అందువల్ల మనకు ఎంతయినా మేలు కలగవచ్చు," అని రాజకీయంగా సలహా ఇచ్చాడు.

రాజుకు ఈ సలహా నచ్చింది. ఆయన నాగన్నను అప్పటికప్పుడు బంధ విముక్తుణ్ణిచేసి, వెంటనే రాజ్యం విడిచి పొమ్మన్నాడు.

నాగన్న బయలుదేరాడు. వాడు పొలి మేర వద్ద నిర్జన ప్రాంతం చేరేసరికి ఒక యువకుడు ఎదురుపడి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేను గజదొంగ నాగన్నను," అన్నాడు నాగన్న.

"అబద్ధం! గజదొంగ నాగన్నను నేను. నువు మారుపేరు పెట్టుకుని, ఎందుకిలా కష్టాలలో చిక్కుకున్నావు?" అని యువకుడు అడిగాడు.

వెంటనే, నాగన్నగా నటిస్తున్న మంత్రి కొడుకు గజదొంగ నాగన్నను గట్టిగా వాటేసుకుని, పారిపోకుండా పట్టుకు న్నాడు. అతని వెనక మారువేషాలలో వచ్చే రాజభటులు దొంగ మీద పడి, అతడి కాళ్ళూ, చేతులూ కట్టి, బంధించారు.





# కోలుకున్నాడు!

ఒక గ్రామంలో రామయ్య అనే రైతు ఉండేవాడు. అతనికి ఆస్తి బాగానే ఉన్నది. డబ్బు జాగ్రత్త కొంచెం ఎక్కువగా గలవాడు. తన కొడుకులిద్దరూ ఎదిగి రాగానే రామయ్య వాళ్ళకు పెళ్లిళ్లు చేసి, వ్యవసాయ భారం వాళ్లకు అప్పగించాడు.

రామయ్యను చూస్తే కోడళ్ళు ఇద్దరికీ గిట్టలేదు, ఎందుకంటే వాళ్ళు ఖర్చు చేసే ప్రతి పైసాకూ గీసిగీసి లెక్కలు అడిగేవాడు.

ఒకసారి రామయ్యకు సుస్తీ చేసింది. కొడుకులు వైద్యుణ్ణి పిలుస్తామంటే ఆయన ఒప్పుకోక, అదే పోతుందన్నాడు. కాని రోగం ముదిరి, రామయ్యకు నోరు పడిపోయింది. అప్పుడు కూడా కొడుకులు వైద్యుణ్ణి తెస్తామంటే వద్దని సైగజేశాడు.

ఇప్పుడు రామయ్య కోడళ్ళకు మామ గారి అరడి తప్పిపోయి, స్వేచ్ఛ వచ్చింది. వాళ్ళ ప్రోద్బలం వల్ల అన్నదమ్ము లిద్దరూ భాగాలు పంచుకున్నారు.

ఒకరోజు పెద్దకొడుకు రామయ్య పడుకుని ఉన్న గదిలోకి వచ్చి, "నాన్నా, ఈ గది నా వాటాలోకి వచ్చింది. దీన్ని బాగు చేయించాలి. ప్రస్తుతం నువు పశువుల పాకలో పడుకో!" అని తండ్రిని మంచంతో సహా పశువుల పాకలోకి చేర్పించాడు.

అటు తరవాత రామయ్యకు జీవితం దుర్భరమయింది. కోడళ్ళూ, కొడుకులూ ఆయనను గురించి పట్టించుకోవటమే మానేశారు. సరి అయిన తిండి లేకా, మందు మొదలే లేకా, రామయ్యకు కాళ్ళూ, చేతులూ చచ్చుబడిపోయాయి.

ఒకనాడు గొడ్ల పాకలోకి వచ్చిన పెద్ద కొడుకు తన తండ్రి పడుతున్న అవస్థ చూసి ఆశ్చర్యపోయాడు. రామయ్య

ఎస్. రాజేశ్వరి

ఏదో చెప్పటానికి ప్రయత్నిస్తున్నాడు. చెయ్యి ఎత్తటానికి కూడా ప్రయత్నిస్తున్నాడు. ఆయన కళ్ళలో ఏదో ఆరాటం కనిపిస్తున్నది.

పెద్ద కొడుకు చిన్న కొడుకును పిలిచాడు. తరవాత కోడళ్ళు ఇద్దరూ వచ్చారు. ఊళ్ళోవాళ్ళు కూడా కొందరు వచ్చారు. రామయ్య ఏం చెప్పటానికి యత్నిస్తున్నాడో ఎవరికీ అంతుబట్టలేదు.

చివరికి అందరూ చేరి ఒక అభిప్రాయానికి వచ్చారు. రామయ్యలాటి పొదుపరి ఎంత డబ్బయినా కూడబెట్టి, ఎక్కడో దాచి ఉంటాడు; ఆ రహస్యం కొడుకులకు చెప్పాలని ఆరాటపడుతున్నాడు! మంచి వైద్యం చేసి మాట తెప్పిస్తేగాని ఆ రహస్యం బయటికి రాదు.

వెంటనే రామయ్యను కొడుకులిద్దరూ పట్నం తీసుకుపోయి, అక్కడ ఉండే గొప్ప గొప్ప వైద్యులచేత వైద్యం చేయించారు. డబ్బు ఖర్చు అవుతున్నదని రామయ్య గిలగిలలాడటం తెలుస్తూనే ఉన్నది. కాని కొడుకులు పట్టుబట్టి, తండ్రికి వైద్యం చేయించి, తిరిగి మాట తెప్పించారు. తరవాతకొడుకులూ, కోడళ్లూ రామయ్య చుట్టూ మూగి, ''డబ్బు ఎక్కడ దాచారు?'' అని అడిగారు.

రామయ్య ఆశ్చర్యపడి, ''డబ్బు దాచటమేమిటి? నేను ఎక్కడా డబ్బు దాచలేదే?'' అన్నాడు.

''మరి ఆ రోజు మాతో ఏదో చెప్పాలని ఆరాటపడ్డారు. ఏమిటది?'' అని కొడుకులు అడిగారు.

రామయ్య కాసేపు ఆలోచించి, చివరకు, ''అదా? మన అవుదూడ పాక ఊడ్చే చీపిరికట్ట నములుతున్నది. చీపిరికట్ట వృథాగా పాడైపోతున్నది. ఇంతలోనే పెద్దవాడు వచ్చాడు. వాడికి ఆ మాట చెప్పాను. వాడు గ్రహించలేదు. మీరైనా గ్రహిస్తారేమో అనుకుంటే మీరూ గ్రహించలేదు,'' అని నిట్టూర్చాడు.

రామయ్య కొడుకులూ, కోడళ్ళూ ఈ మాట విని నిర్ఘాంతపోయారు.





# వరుడి అర్హతలు

పూర్వం కాశీనగరంలో విశ్వనాధు డనే పేదబ్రాహ్మణుడు ఉండేవాడు. అయన యాచక వృత్తితో జీవించేవాడు. విశ్వనాధుడికి మనోజ్ఞ అనే అందమైన కూతురు ఉండేది.

మనోజ్ఞ యుక్తవయస్కురాలయింది. పేదబ్రాహ్మడి కూతురుకు పెళ్ళికావటమంటే మాటలు కాదు. ఎవరికో దారిన పొయ్యేవాడికి తన కూతుర్ని ఇయ్యటం విశ్వనాథుడికి ఎంత మాత్రమూ ఇష్టం లేదు. ఆయనకు కూతురి పెళ్ళి సమస్య మనోవ్యాధిగా తయారయింది.

ఈ స్థితిలో నగరంలో ఒక చాటింపు జరిగింది: "ఫలానా రాజశేఖరుడుగారి అబ్బాయికి వధువుకావాలి. అందమూ, సౌశీల్యమూగల కన్యల తండ్రులు సత్రం దగ్గిరికి వచ్చి రాజయ్యగారిని కలుసుకోవచ్చు. వరుడు ఆసరాలేకుండా నిలబడడు. అతడికి ఎప్పుడూ పరధ్యానమే. ముగ్గుర్ని అడిగి గాని ఏ పనీ చెయ్యడు. తలమోసినంత సంపాదనా, మేఘంలాటి గుణమూ కలవాడు."

ఈ చాటింపు విని విశ్వనాధుడు నవ్వుకున్నాడు. వరుడు కుంటివాడూ, మతిలేనివాడూ, తట్టలు మోసేవాడూ, మేఘంలాగా క్షణానికో విధంగామారి, చివరకు నీరు కారిపోయేవాడు కాబోలు! ఈ భాగ్యానికి చాటింపు కూడా దేనికో!

విశ్వనాధుడు విన్న చాటింపును మనోజ్ఞ కూడా విని, "నాన్నా, మనం సత్రం దగ్గిరికి వెళదామా ?" అన్నది.

"వద్దు, తల్లీ! ఏరి కోరి అటువంటి వరుణ్ణి చేసుకుంటావా?" అన్నాడు తండ్రి.

కాని మనోజ్ఞ సత్రం దగ్గిరికి వెళ్ళాలని పట్టుబట్టింది. అమె తెలివి తేటలలో నమ్మకంగల విశ్వనాధుడు సరేనన్నాడు.

మారుపాక మంజురాణి

ఇద్దరూ సత్రం వద్దకు వెళ్ళారు. మనోజ్ఞ రాజయ్యగారికి నమస్కారం చేసి, ''అయ్యా, మీ అబ్బాయిని నేను పెళ్ళాడతాను,'' అన్నది.

''అమ్మా, నా కొడుకు లక్షణాలన్నీ విన్నావుగదా! ఏదో కన్న ప్రేమకొద్దీ వాడికి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను. అంతే! కొంచెం ఆలోచించుకో,'' అన్నాడు రాజయ్య.

మనోజ్ఞ నవ్వి, ''అయ్యా, ఆలోచించవలసినది ఏముంది? మీ అబ్బాయిని అదివరకే ఒకరు పెళ్ళాడారు గద! నా కెందుకు అభ్యంతరం?'' అన్నది.

రాజయ్య ముఖం వికసించింది. ఆయన నవ్వి, ''సరేనమ్మా, నిన్ను నా కోడలుగా చేసుకుంటాను,'' అన్నాడు.

ఆయన విశ్వనాథుడుండే చోటూ, ఇతర వివరాలూ తెలుసుకుని, తండ్రి కూతుళ్లను పంపేశాడు.

ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు విశ్వనాథుడు, ''అమ్మా, ఇలాటి వరుణ్ణి ఎన్నుకోవటం గాక, నీకొక సవతి కూడానా?'' అన్నాడు కూతురితో.

''నాన్నా, ఆ వరుడు ఎవరనుకుంటున్నావు? కాశీరాజు! ధర్మం ఆధారం లేకుండా నిలబడడు. పరులను గురించే ఎప్పుడూ ఆలోచిస్తాడు. మంత్రులతో ఆలోచించకుండా ఏ పనీ చెయ్యడు. తల మీద కిరీటం బరువువల్ల కలిగే సంపాదన. మేఘంలాగా సముద్రం నుంచి ఉప్పు నీరు గ్రహించి, ప్రజలకు మంచి నీరు ఇచ్చే గుణంగలవాడు!'' అన్నది మనోజ్ఞ.

"మరి, అతని మొదటి భార్య ఎవరు?" అని విశ్వనాథుడు కూతుర్ని అడిగాడు.

''ఇంకెవరు? భూదేవి!'' అన్నది మనోజ్ఞ.

ఆమె ఊహ సరి అయినదేనని త్వరలోనే రుజువయింది. ఆమె కోసం రాజభవనం నుంచి బంగారు మేనా వచ్చి, ఆమెను తీసుకుపోయింది. తరవాత కొద్ది రోజులకే ఆమెకూ, కాశీరాజ కుమారుడికీ వైభవంగా వివాహం జరిగింది.





# విధినిర్వహణ

రామశాస్త్రి నగరంలో పేరున్న వైద్యుడు. ఆ నగరం ఒక నది ఒడ్డున ఉన్నది. నదికి పుష్కరాలు వచ్చిన సందర్భంగా ఒక సాయంకాలం రామశాస్త్రి చిన్ననాటి స్నేహితులు శ్రీహరి, విఠలూ, ఆయన ఇంటికి వచ్చారు. శ్రీహరి బడి నడిపే పంతులు. విఠలు ఒక చిన్న గ్రామంలో న్యాయాధికారి.

రామశాస్త్రి తన మిత్రులను ఊళ్ళో ఉన్న దేవాలయాలన్నిటికీ తిప్పి చీకటి పడేవేళకు ఇంటికి తెచ్చి, తన స్నేహితులకు కూడా వంట చెయ్యమని తన భార్యకు చెప్పి, ముందు గదిలోకి వచ్చి కూర్చుని, తన స్నేహితులతో కబుర్లు చెప్పసాగాడు. అతను తన విధిని నిర్వహించటంలో ఒక్కసారి అక్రమంగా ప్రవర్తించిన మాట తన స్నేహితులతో ఈ విధంగా చెప్పాడు:

ఆ ఊళ్ళో ఒక గొప్ప ధనికుడు నెల నెలా విందుచేసి, దానికి గొప్పవాళ్ళను మాత్రమే ఆహ్వానించేవాడు. ఒకసారి రామశాస్త్రికి కూడా ఆహ్వానం వచ్చింది. ఊళ్ళోని గొప్పవాళ్ళ చిటాలో తన పేరు కూడా ఎక్కింది గదా అనీ, ఊరి పెద్దల పరిచయం చేసుకుని తాను తన వృత్తిలో బాగా పైకి రావచ్చుననీ రామశాస్త్రి ఎంతో సంతోషించాడు.

అతను ఉన్నంతలో మంచి బట్టలు కట్టుకుని, విందుకు బయలుదేర బోతూండగా ఒక పేదరాలు గోలగా ఏడుస్తూ రామశాస్త్రి కాళ్ళమీద పడి, "నా మొగుడి ప్రాణం నువే కాపాడాలి. పదిమంది సంతానానికి దిక్కు అయిన వాడు అకస్మాత్తుగా విరుచుకుపడి పోయాడు." అని కళ్ళనీళ్ళతో దీనంగా వేడుకున్నది.

మాచిరాజు కామేశ్వరరావు

రామశాస్త్రి మనసు విందుమీద ఉన్నది. అదీగాక ఈ పేదరాలి మొగుడికి వైద్యం చేసినందువల్ల తనకేమీ లాభం ఉండదు. అందుకని అతను, ''తొందర పనిమీద వెళుతున్నాను,'' అని వెళ్ళిపోయాడు. అయితే ఏదో అవాంతరం వచ్చి ఆ రోజు విందు వాయిదా పడింది. రామశాస్త్రి ఇంటికి తిరిగివచ్చి, ఆ పేదరాలి ఇల్లు కనుక్కొని వెళ్ళేసరికి అంతా మించి పోయింది. సమయానికి చికిత్స జరగక ఆమె భర్త చనిపోయాడు.

''ఈ ఒక్క సందర్భంలో తప్పిస్తే నేను నా విధి నిర్వహణలో మరెన్నడూ పొరపాటు రానియ్యలేదు,'' అన్నాడు రామశాస్త్రి.

''నీలాగే నేను కూడా ఒక్కసారి నా ధర్మాన్ని అతిక్రమించాను,'' అంటూ బడిపంతులు శ్రీహరి ఇలా చెప్పాడు:

అతను పనిచేసేది జమీందారుగారి బడిలో. అందులో జమీందారుగారి అబ్బాయి చదువుకునేవాడు. అయితే అది తమ బడే గనక చదువు విషయం అశ్రద్ధ చేస్తూ కూడా విద్యార్థులలో మొదటివాడుగా ఉండేవాడు. ఆ బడిలో ఒక రైతు కొడుకు చేరాడు. వాడు చాలా చురుకైనవాడు. ప్రతి విషయంలోనూ వాడు జమీందారుగారి అబ్బాయిని మించి ఉండేవాడు.

అందుచేత జమీందారుగారి అబ్బాయి ఆ రైతు కొడుకును బడినుంచి పంపెయ్య



మని శ్రీహరిని కోరాడు. వాడు చెప్పినట్టు చెయ్యకపోతే తన ఉద్యోగం ఎక్కడ ఊడుతుందోనని, శ్రీహరి ఆ రైతు కొడుకును, చెప్పని పాఠాలలో ప్రశ్నలు వేసి, ఆ పాఠాలు ఇంకా చెప్పలేదన్నందుకు వాడి మీద ఇంత ఎత్తు లేచి, వాణ్ణి ఒకనాడు బడి నుంచి వెళ్ళగొట్టాడు.

రైతుకు తన కొడుక్కు జరిగిన అన్యాయం గురించి తెలుసు. అయినా అతడు జమీందారుకు భయపడి, మెదలకుండా పూరుకున్నాడు. ఆ విధంగా చదువుకుని ఎంతో పైకి రావలసిన రైతు కొడుకు, తండ్రితోపాటు పొలం పనులు చూసుకోవలసి వచ్చింది.

"మీలాగే నేను కూడా ఒక్కసారి నా విధిని నిర్వర్తించలేక పోయాను," అంటూ న్యాయాధికారి విఠలు ఇలా చెప్పాడు:

ఒకసారి అతని దగ్గిరికి ఒక వివాదం వచ్చింది. ఒక పెద్దవ్యాపారి తన జాగాలో పెద్ద భవంతి కట్టుకున్నాడు. అతని స్థలాన్ని అనుకునే ఒక కాపు స్థలమూ, గుడిసే ఉన్నాయి. ఎంతగా అడిగినా కాపు ఆ స్థలాన్ని వ్యాపారికి అమ్మలేదు. వ్యాపారి తన మనుషులచేత కాపువాడి గుడిసె కూలదోయించి, స్థలం ఆక్రమించుకున్నాడు.

నిజం విఠలుకు తెలుసు. కాని అతని చెల్లెలిని వ్యాపారి కొడుక్కు ఇచ్చి పెళ్లి



చేసేటందుకు మాటలు జరుగుతున్నాయి. వ్యాపారి బోలెడు పలుకుబడి కలవాడు. అందుచేత విఠలు వ్యాపారికి అనుకూలంగా తీర్పు చెప్పాడు.

"ఇది ఒక్కటే నేను నా వృత్తిలో చేసిన అక్రమం," అన్నాడు విఠలు.

"మొత్తం మీద మనమంతా మన విధులను సక్రమంగా నెరవేర్చుతున్నట్టే! ఇంక భోజనాలకు లేద్దాం," అంటూ రామశాస్త్రి వంట ఇంట్లోకి అడుగుపెట్టి నిర్ఘాంతపోయాడు. అతని భార్య వంటచేసే ప్రయత్నంలో లేదు. తలుపు పక్కనే కూర్చుని, ముందు గదిలో జరిగిన సంభాషణ వింటున్నది.

"ఇదేమిటి, ఇలా కూర్చున్నావు? వంట చెయ్యలేదూ?" అని రామశాస్త్రి అడిగాడు.

"లేదు. ఈ పూట నాకు ఒళ్ళు నొప్పులుగా ఉన్నది," అన్నదామె.

రామశాస్త్రికి ఒళ్ళు మండిపోయింది. ఆ సమయానికి పూటకూళ్ళ ఇల్లుకూడా కట్టేసి ఉంటారు. రాకరాక వచ్చిన తన స్నేహితులు పస్తుపడుకోవాలా? అతనికూడా ఆకలి దహించుకుపోతున్నది.

ఆ కోపంతోనూ, ఆకలితోనూ అతను తన భార్య మీద చెయ్యి చేసుకోబోయాడు.

"ఆగండి. నేను ఒక్కసారి నా విధి నిర్వర్తించనందుకే నన్ను కొట్టవచ్చారే. ఏం మునిగిపోయిందని? ఒక పూట తిండిలేకపోతే ఎవరమూ చచ్చిపోం. కాని వైద్యుడు తన విధి నిర్వర్తించకపోతే నిండుప్రాణం పోతుంది. గురువు విద్యార్థి పట్ల అక్రమంగా ప్రవర్తిస్తే వాడి జీవితం భ్రష్టు అయిపోతుంది. న్యాయాధికారి అక్రమంగా ప్రవర్తిస్తే ఒక మనిషి అనవసరంగా శిక్షకు గురి అవుతాడు. ఈ వృత్తులు చేసేవాళ్లు ఒక్కసారి తమ విధినిర్వహణలో పొరపాటు చేసినా క్షమించరాదు. ముందు మీరు ముగ్గురూ ఈ విషయం తెలుసుకోవాలి. మీరు బయటికి వెళ్ళినప్పుడే వంట చేసేశాను. కాళ్లుకడుక్కుని రండి, వడ్డిం చేస్తాను," అన్నది రామశాస్త్రి భార్య.





# వీర హనుమాన్

అంజనాదేవి చేసిన ఘనమైన అతిథి సత్కారాలు పొంది, విందు ఆరగించిన తరవాత, రాముడితో వచ్చినవారందరూ తిరిగి అయోధ్యకు వెళుతున్నారు.

దారిలో సీత, యశోధరతో, "చూశావా! నేను ముందే చెప్పానుగదా! నీ భర్తకు ఎటువంటి భయమూ ఉండదని. హనుమంతుడి శరణు పొందిన యయాతి చరితార్థుడైనాడు!'' అని అన్నది.

దానికి యశోధర కృతజ్ఞతతో సీతను చూస్తూ, ''అంతా, మీ సీతారాముల అనుగ్రహమే కదమ్మా! హనుమంతుని హృదయంలో రామునితోబాటు నీవు కూడా మాకందరికీ కనిపించావు. మా కన్నులు ధన్యమైనాయి!'' అన్నది.

"ఔను, సీతమ్మా, మేమూ చూశాము!" అంటూ ఆనందోత్సాహాలతో చంద్రాంగదుడూ, చంద్రముఖీ కూడ బలుకుతూ చప్పట్లు చరిచాడు. యశోధర వారిని ఉష్ అని వారించి, తన పిల్లలను మమతగా చూస్తూన్న సీత ముఖాన్ని చూసి, ''అమ్మా! త్వరలో నీవు సంతానవతివి అవుతావు; నీ ముఖంలో మాతృకళ దివ్యంగా కనిపిస్తున్నది,'' అన్నది.

సీత సిగ్గుపడుతూ, చిరునవ్వుతూ యశోధరతో, ''వయసులో చిన్నదానివిగా కనిపిస్తున్నా, ఇలాంటి రత్నాలవంటి పిల్లల్ని కన్నందుకు నాకంటే నీవు గొప్పదానివి; అదృష్టవంతురాలవు. నీ మాటలు ఆశీర్వాదాలుగా భావిస్తున్నాను!'' అన్నది.

## 42. అశ్వమేధయాగము



ఆ విధంగా పల్లకిలో వాళ్లు ముచ్చటించుకుంటూండగా అయోధ్యకు చేరారు. యయాతి సకుటుంబంగా రాముడి అతిథిగా ఉన్నాడు. సీత యశోధరతో సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ, ఆమె పిల్లలతో ఆటపాటలతో ముచ్చట తీర్చుకున్నది. పిల్లలిద్దరూ 'అమ్మా! అమ్మా!' అంటూ చుట్టుకొని తిరుగుతూ ఉంటే ఆమె ఆనంద తన్మయురాలైంది.

కొన్నాళ్ళ తర్వాత యయాతి సీతారాముల వద్ద శలవు తీసుకొని భార్యా, బిడ్డలతో తన రాజ్యానికి వెళ్లాడు.

ఒక పూర్ణిమనాటి సాయంకాలం సీతతో రాముడు అంతఃపురోద్యానవనంలో విహరిస్తున్నాడు. అప్పుడే చంద్రోదయమవుతూన్నది. రాముడు సీతతో "జానకీ! అటు చూడు!" అని చూపించాడు.

సీత, "తూర్పుదిశ అనే కౌసల్యాదేవికి రామచంద్రుడు ఉదయిస్తున్నాడు!" అని అన్నది.

రాముడు, "కాదు, సీతాదేవికి అటువంటి చంద్రోదయమే అవుతుంది, అని తూర్పుదిక్కు జోస్యం చెబుతోంది," అన్నాడు.

"ఆ చంద్రుడు రామచంద్రుడి లాగే ఉంటాడని కూడ చెబుతున్నది కదూ?" అన్నది సీత.

"ఆ చంద్రుడు జానకీదేవిని పోలి ఉంటాడని అంటున్నది!" అన్నాడు రాముడు.

ఇద్దరూ ఆనందంగా నవ్వుకున్నారు. వారు కూర్చున్న చంద్రశిలా వేదిక దాపునే ఉన్న చిన్న కొలనులో రెండు కలువలు జంటగా వికసిస్తున్నవి. చూడముచ్చటగా ఉన్న వాటిని పదేపదే చూస్తూ సీత రాముడితో అంతఃపురంలోకి వెళ్ళింది.

కొంత రాత్రి గడిచాక సీత ఒకసారి యివతలకు వచ్చి మేడ మీద నుంచి ఉద్యానవనం కలయజూచింది. పున్నమి వెన్నెల నిండుగా ఉన్నది. దాపున ఉన్న ఆ చిన్న కొలనులో వెన్నెల మిలమిలా

మెరుస్తున్నది. కలువలు రెండూ తెల్లగా నక్షత్రాల్లా మెరుస్తూ కనిపించాయి సీతకు.

* * *

గంధమాదన పర్వతం మీద హనుమంతుడు జపతపాలతో గడుపుతూండగా, ఎంతకాలమైందో తెలీకుండానే చాలా ఏళ్ళు దొర్లిపోయినై. ఒకనాడు అయోధ్య నుంచి రాముడి ఆప్త అంతరంగికుడూ, వయోవృద్ధుడూ అయిన భద్రుడు వచ్చి, "రాముడు నిన్ను రమ్మంటున్నాడు!" అని హనుమంతుడికి చెప్పాడు.

భద్రుడు చాలా విచారంగా కనిపించాడు. "ఏమి జరిగింది? అయోధ్యలో జరిగిన విశేషాలేమిటి?" అని హనుమంతుడు అడిగాడు.

భద్రుడు నిట్టూర్చి, "అంతా జరిగిపోయింది...." అన్నాడు.

"ఏమిటి నీవంటున్నది? వివరంగా చెప్పు!" అన్నాడు హనుమంతుడు.

"క్లుప్తంగా చెప్తాను విను!" అంటూ భద్రుడు జరిగినది ఇలాగ చెప్పాడు:

ఒకనాడు ఋషులను కూడా వెంటబెట్టుకుని బ్రాహ్మణుల గుంపొకటి, రాముడి దగ్గిరికి వచ్చింది. శంబుకుడు అనే శూద్రుడు వేదాధ్యయనం చేసి తపస్సు చేస్తూన్న కారణంగా ధర్మహాని కలిగిందనీ, అందువల్ల తమ బాలుడొకడు అకాల



మరణం పొందాడనీ, వెంటనే శంబుకుణ్ణి వధించాలనీ వాళ్లు, రాముడిని ఆజ్ఞాపిస్తున్నట్లుగా చెప్పారు.

అన్నివర్గాలవారినీ తృప్తిపరుస్తూ రాజ్యపాలన చేయాలనే దీక్ష పట్టిన రాముడు వెళ్ళి, సాధు జీవనం గడుపుతూ తలక్రిందుగా తపస్సు చేస్తూన్న శంబుకుణ్ణి నరికాడు. అప్పుడు శంబుకుడి భార్య కపిల రాముడితో, "ఓ రాజా! నీకు ఏదో అనర్థం రాబోతూన్నది! దానికి సూచనగా ఇంతటి దారుణం చేశావు!" అని హెచ్చరించి, ప్రాణాలు విడిచింది.

అది జరిగిన కొద్ది రోజుల తర్వాత ఒకనాటి రాత్రి రాముడు, భద్రుడు కూడా



వెంటరాగా మారువేషాలతో వేగు తిరుగుతూ అయోధ్య చివర ఒక చాకలిపేట సమీపానికి వచ్చారు. అక్కడ అలుమగల తగువు జరుగుతూన్నది.

ఎక్కడికో వెళ్ళి కొన్నాళ్ళుండి వచ్చిన పెళ్ళాన్ని ఒక చాకలివాడు చావబాది ఇంటి గుమ్మం తొక్కనియ్యలేదు. రక్తం చిమ్ముతున్న వీపు చూపుకుంటూ చాకలిది భోరున వెక్కి వెక్కి ఏడుస్తూ, "ఆ సీతను రాముడంతటి మారాజే ఏలగా లేంది నువ్వేనా మహా మగాడివి?'' అని అన్నది. తప్పతాగి తూలుతూన్న చాకలివాడు ఓంఢ్ర పెట్టినట్టుగా, "రాజును గదా, అడిగేవాడెవుడూ, అనేవాడెవడూ అని అన్నాళ్ళు లంకలో పరాయివాడి దగ్గిరున్న దాన్ని తెచ్చుకుని సిగ్గుమాలి కులకడానికి నేను వెఱ్ఱి రాముణ్ణి కాను.'' అని అందరిముందూ అరిచాడు.

దాని ఫలితంగా రాముడు సీతను అరణ్యంలో విడిచిరమ్మని లక్ష్మణుడికి ఆజ్ఞాపించాడు. అప్పుడు సీత నిండు చూలాలు. ఆ ముందటి రోజునే సీత తనకు మునిపల్లెలకు వెళ్ళి మునిపత్నులతో ముచ్చటగా గడిపి రావాలని కోరికగా ఉన్నదని రాముడితో చెప్పింది. ఆ నెపంతోనే లక్ష్మణుడు సీతను రథంలో తీసుకు వెళ్లి అడవిలో విడిచి వచ్చాడు.

సీతను త్యజించి రాముడు నిద్రాహారాలు మాని కృంగిపోవడం భద్రుడు చూడలేకపోయాడు. భద్రుడు చిన్నతనంలో రాముణ్ణి ఎత్తుకొని తిప్పి లాలించి ఆడించినవాడు. పసి రాముడు చందమామను ఇమ్మని మారాంపెట్టినప్పుడు అద్దం యిచ్చి చందమామను చూపినప్పుడు తన ముఖాన్నీ, చంద్రబింబాన్నీ కలిపి అందులో చూస్తూ రాముడు ముద్దుముద్దుగా రామ-చంద్రుడు అని పలికాడు. అప్పుడు భద్రుడు రాముడి పక్క తన ముఖాన్నిపెట్టి, మరి ఇప్పుడో? అని అడిగితే, రామ-భద్రుడు అని మరింత ముద్దుగా అన్నాడు రాముడు. అప్పట్నించీ

రాముడికి రామచంద్రుడు, రామభద్రుడు అనే పేర్లు వచ్చాయి. రాముడితో అలాంటి అనుబంధము ఉన్న భద్రుడికి ఆ చాకలి వాడిని పట్టి చిత్రవధ చేయాలనిపించి, చాకలిపేటకు వెళ్లి విచారించాడు.

"అంతమాట అన్నందుకు వాణ్ణి పట్టి ఉతికేద్దామని పట్టుకోబోతే వాడు దొరక్కుండా పారిపోయాడు! వాడి పెళ్లామూ కనిపించలేదు!" అని అక్కడి వాళ్ళు భద్రుడితో చెప్పారు.

లక్ష్మణుడు విడిచి వెళ్ళాక సీత నదీ ప్రవాహంలో కొండరాతి మీదినుంచి దూక బోతూండగా వాల్మీకి మహాముని వారించి తన ఆశ్రమానికి తీసుకెళ్లాడు. సీత ఇద్దరు మగ కవల బిడ్డలను కన్నది. కుశుడు, లవుడు అని వారికి పేర్లుపెట్టి, వాల్మీకి విద్యా బుద్ధులు నేర్పాడు, తాను రచించిన రామాయణ కథను గానం చేయడం కూడా నేర్పాడు. సీత వాళ్లకు విలువిద్య నేర్పింది.

ఒకనాడు కుశలవులు రామాయణ రాముడెలా ఉంటాడో, తమ తల్లి పేరే గల సీత ఎలాంటిదో చూడాలని అయోధ్యకు రామకథను పాడుతూ వెళ్ళారు.

రాముడు సీతను కొంత మరిచిపోవ డానికి వసిష్ఠుడు మొదలైన పెద్దలు ఆలోచించి, రఘువంశ రాజులందరూ



చేసినట్లే లోక కళ్యాణం నిమిత్తం అశ్వమేధ యాగాన్ని చేయవలసిందని రాముడికి ఆదేశించారు. బంగారంతో మలచిన సీత విగ్రహాన్ని పక్కనుంచుకుని రాముడు అశ్వమేధ యాగాన్ని ప్రారం భించాడు. అదే రోజున ముని బాల కులమని చెప్పుకొంటూ లవకుశులు రామాయణం పాడుతూ అయోధ్యా నగరం వీధులు తిరుగుతూ వస్తున్నారు. లక్ష్మణుడు వాళ్ళను చూసి వాళ్ళెవరై ఉండవచ్చునో కొంత అంచనాకట్టి రాజ మందిరానికి తీసుకువెళ్ళాడు.

రాజ ప్రాసాదంలో కుశలవులు సీత అగ్నిప్రవేశ ఘట్టాన్ని కన్నులకు కట్టేలాగ



పాడి వినిపించారు. అక్కడ ఉన్న కౌసల్య మొదలైన అంతఃపుర స్త్రీలు, యాగంచేయిస్తున్న పెద్దలూ, పరివారమూ పుర ప్రముఖులు అంతా కన్నీరు కారుస్తూ స్వర్ణ సీతను చూసి చేతులు జోడించి కళ్ళకద్దుకున్నారు. రాముడు వాళ్ళు మునిబాలురనుకుంటూనే తెలియరాని ఆనందంతో వాళ్ళను దగ్గరకు తీసుకొని ముద్దాడి, అనేక కానుకలు, చీనాంబరాలు ఇచ్చి పంపాడు.

యాగ ప్రారంభ క్రియలన్నీ పూర్తయ్యాక రఘువంశ సూర్యపతాకంతో అలంకరించబడ్డ యాగాశ్వం స్వేచ్ఛగా స్వైరవిహారం చేయడానికి విడిచిపెట్టబడింది. ఆ గుర్రం దౌడు తీసి తిన్నగా వెళ్లి వాల్మీకి ఆశ్రమ సమీపాన్ని చేరింది. గుర్రం నుదుట ఉన్న బంగారు బాసికం చదివి, అది రాముడి యాగాశ్వంగా గుర్తించి దాన్ని పట్టి కట్టివేశారు లవకుశులు.

గుర్రాన్ని విడిపించడానికి వెళ్ళిన శత్రుఘ్న, భరత, లక్ష్మణులు కుశలవులతో యుద్ధంచేసి మూర్ఛపోయారు. రాముడు వెళ్ళి యుద్ధం చేశాడు.

కుశలవులు తమ తల్లి మహాసాధ్వి అని ప్రతిజ్ఞ చెప్పి విడిచిన బాణాలు తగిలి రాముడు మూర్ఛపోయాడు. సీత వచ్చి రాముడి పాదాలు తాకి తెలివి తెప్పించింది.

సీత పవిత్రురాలనీ, రాణిగా అయోధ్యకు తీసుకెళ్ళమనీ వాల్మీకి రాముడికి చెప్పాడు. అందుకు రాముడు సీత ఆ విధంగా శపథం చేసి పౌరులను మెప్పించితే బాగుంటుందని అన్నాడు.

అయోధ్యకు వచ్చి కుమారులను రాముడికి అప్పగించి సీత, "నా పవిత్రతకు నిదర్శనంగా భూదేవి నన్ను స్వీకరించును గాక!'' అని పలికిన వెంటనే భూమి కంపించింది. దిక్కులు చీకట్లుకమ్మాయి. మెరుపులు మెరిశాయి. ఉరుము లురిమాయి. అయోధ్యా పౌరులు ఇళ్ళ లోంచి బయటకు వచ్చి కోలాహలంగా

పరుగులెత్తి అందరూ సీత ఉన్న చోట గుమిగూడారు. సీత నిల్చున్న చోట భూమి చీలింది. అందులోంచి మణిమయ సింహాసనం మీద కూర్చుని ఉన్న భూదేవి వచ్చింది. ఆ సింహాసనాన్ని నాగకాంతలు మోస్తున్నారు. భూదేవి సింహాసనం దిగి, తల్లి బిడ్డను తీసుకున్నట్లుగా రెండు చేతులతో సీతను ఎత్తుకొని సింహాసనం మీద తన ఒడిలో కూర్చుండబెట్టుకొంది. భూమి మళ్ళీ కంపించింధి. అయోధ్యా నగరం ఊగిసలాడింది, కాని ఒక్క ఇంటి పెంకు అయినా రాలలేదు. సీతతో భూదేవి లోపలికి వెళ్లిపోయింది. చీలిన ఆనవాలైనా లేకుండా భూమి మూసుకుంది. అందరూ కర్రగట్టి కళ్ళప్పగించి చూస్తూండగా, అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.

రాముడు ఆగ్రహంతో భూమిని చీలుస్తానని వింటికి బాణాన్ని సంధించాడు. అప్పుడు ఆకాశం నుంచి, "రామా! రఘువంశ రాజులందరూ భూమిని చల్లగా పాలించారు, నువ్వు భూమిని చీలుస్తావా? చేతులారా నువ్వే శపథం చేయించి సీతను పుట్టినింటికి పంపించి ఎందుకు ఆవేశపడతావు?'' అని అశరీరవాణి వినిపించింది. రాముడు ఎత్తిన ధనుస్సు దించాడు, తల దించుకున్నాడు.

రాముడు లవకుశులను యువరాజులుగా సింహాసనం మీద కూర్చుండబెట్టి, విషాదమూర్తిగా మిగిలాడు.

''అశ్వమేధం సాగుతూన్నది. యాగాశ్వం ఉత్తరం నుంచి తూర్పుగా వెళుతున్నది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు సైన్యంతో దాని వెంట వెళ్తున్నారు,'' అని భద్రుడు చెప్పడం ముగించాడు.

శిలాప్రతిమలాగ కన్నీరు కారుస్తూ వింటూన్న హనుమంతుడు కళ్లు ఒత్తుకొని, లేచి. ''నే నిప్పుడే రాముడి దగ్గిరకు వెళ్తున్నాను. నువ్వు వెనకగా రా!'' అని భద్రుడికి చెప్పి తన గదను భుజాన వేసుకొని, ఆకాశానికి ఎగిరి అయోధ్యకు వెళ్లాడు.



# రురుడు – ప్రమద్వర



అనేకవేల ఏళ్ళక్రితం సింధు, సరస్వతి నదీ ప్రాంతాలలో ఒక గొప్ప నాగరికత విలసిల్లింది. అప్పటి ప్రజలు ప్రకృతి తోనూ, దేవతలతోనూ సన్నిహితులై జీవించారు.

వారిలో వేదకర్తలైన ఋషులున్నారు. వారు సుఖజీవనమూ, దీర్ఘాయువూ కోరి, జనన మరణాలను గురించి, జన్మ రహస్యం గురించి ఆలోచించారు. రురుడు అనే యువకుడి కథ అనాటిది.





రురుడు ఋషి కుమారుడు. ప్రమద్వర అనే గంధర్వ కన్యను ఋషి పెంచాడు. వారిద్దరూ అరణ్యంలోనూ, నదీ తీరాలా స్వేచ్ఛగానూ, సంతోషంగానూ ఆడుకున్నారు.



వాళ్లు యుక్తవయస్కులయాక, ఇద్దరికీ పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళికి ముందురోజు రురుడు అరణ్యంలోకి వెళ్ళి, ప్రమద్వర కోసం పూలు కోసుకు వచ్చాడు. అతను తిరిగి వస్తూండటం ప్రమద్వర చూసింది.



అకస్మికంగా ఒక సర్పం ప్రమద్వరను కాటువేసి పారిపోయింది. రురుడు ఆమె ముఖం వివర్ణం కావటం చూసి, పడిపోతూండగా చప్పున పట్టుకున్నాడు.



ప్రమద్వర వెంటనే చావలేదు. అతని పిలుపు విని కళ్ళు తెరిచింది. కాని ఆమె కంఠం బలహీనమైపోయింది. ఆమె కళ్ళు మూసుకున్నాయి.

ఋషి పల్లెలోని స్త్రీలు వచ్చి, ప్రమద్వర మృతదేహాన్ని తీసుకుపోయారు. రురుడు చాలాసేపు ఒంటరిగా స్తబ్ధుడై కూర్చు న్నాడు. తనను ప్రమద్వర నుంచి వేరు చేసిన మృత్యువు ఏమిటి?





రురుడు తన విధిని గర్హిస్తూ అనేక రోజులపాటు అడవిలో తిరిగాడు. అతన్ని ఓదార్చటానికి కూడా ఎవరూ సాహసించలేదు. అతను ఎక్కడ శపించిపోతాడోనని అతన్ని పలకరించ టానికి అందరూ భయపడ్డారు.

చిట్టచివరకు మన్మథుడు అతని ఎదట ప్రత్యక్షమై, యమలోకానికి వెళ్లే మార్గం రురుడికి తెలిపాడు.





రురుడు యమలోకానికి వెళ్ళాడు. ఆ లోకంలో ఉండే భయంకర యమ కింకరులను లక్ష్యపెట్టక, అతను తిన్నగా యముడి వద్దకు వెళ్ళాడు.



అయితే యముడు ప్రార్థనలకుగాని, లంచాలకుగాని లొంగలేదు. రురుడు తన ఆయువులో నగం ధారపోస్తేనేగాని ప్రమద్వర తిరిగి బతకదు. రురుడు సంకోచించకుండా తన ఆయుర్దాయంలో నగం ధారపోశాడు.



మరుక్షణమే రురుడు భూమిమీద, ప్రమద్వర చెంత ఉన్నాడు. ఇద్దరూ నిద్రపోయి లేచినవారిలాగా ఉన్నారు. వారి వివాహానికి అనేకమంది ఋషులు వచ్చి, వారిని ఆశీర్వదించారు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఒక పేద బ్రాహ్మడు ఒక జమీందారు సహాయం కోరాడు. దాత అయిన జమీందారు అతడికి ఒక పాడిఆవును యిచ్చాడు. దానికి ఒక కొట్టంలేదు. కొట్టం కట్టటానికి జమీందారు డబ్బు ఇచ్చాడు. ఆవుకు దాణా, గడ్డి లేదు. జమీందారు అదీ ఇచ్చాడు.

ఆవు ఇచ్చే పాలు నగరంలో అమ్మటం బ్రాహ్మడికి ప్రయాసగా ఉన్నది. అందుకని జమీందారు ఆ పాలను తానే కొంటానన్నాడు.

బ్రాహ్మడికి ఇంకో చిక్కు వచ్చిపడింది. అతని భార్యకు వంటరాదు. అంతదాకా వాళ్ళు భిక్షాటన చేసి జీవిస్తూ వచ్చారు. ఆమె పొయ్యి రాజెయ్యలేదు. జమీందారు బ్రాహ్మడి ఇంటికి వంటమనిషిని పంపాడు. అయితే భోజనాల వేళకు నలుగురు మనుషులు వచ్చారు. వాళ్ళెవరు, ఎందుకు వచ్చారని బ్రాహ్మడు అడిగాడు.

"మీరు ఇద్దకస్తులు గదా? చేసిన వంట తినటానికి జమీందారుగారు వీళ్ళను పంపారు," అన్నది వంటలక్క.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు మార్చి 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '78 మే నెల చందమామలో ప్రకటించబడును.

---

జనవరి నెల పోటీ ఫలితం: కట్టులేని నోరు-కట్టతెగిన యేరు.

గెలుపొందిన వారి పేరు: యు. కమల, శ్రీదేవి కాన్వెంట్, మంగళగిరి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 మే నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar S. Paramasivan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆడుదానివి నీవైతే

రెండవ ఫోటో : ఆడించేవాడిని నేనే

పంపినవారు : రేవతి మహేంద్ర, ఖమ్మం.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Pvt Limited<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Chandamama Publications<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | NAGI REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries:<br>1. B. V. HARISH<br>2. B. V. NARESH<br>3. B. V. L. ARATI<br>4. B. L. NIRUPAMA<br>5. B. V. SANJAY<br>6. B. V. SHARATH<br>7. B. L. SUNANDA<br>8. B. N. RAJESH<br>9. B. ARCHANA<br>10. B. N. V. VISHNU PRASAD<br>11. B. L. ARADHANA<br>12. B. NAGI REDDI |

All Minors—by Trustee :
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras 600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March* 1978

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*




# కావాలి అనుకుంటే
# కావలసినంత వినోదం!
## రేడియో సిలోన్

రేడియో కార్యక్రమాల్లో ఇంటిల్లిపాదికీ ఆనందం కలిగించాలంటే-'రేడియో సిలోన్' కు మించినది లేదు! ఇంగ్లీషు, హిందీ, తెలుగు, తమిళం, కన్నడ, మలయాళ భాషల కార్యక్రమాల్లో స్పష్టత, స్వచ్ఛత కావాలంటే 'రేడియో సిలోన్' వినవలసిందే! రేడియోలో అన్ని స్టేషన్లూ త్రిప్పి చూడండి - ఏ స్టేషన్ విస్పష్టంగా విన వస్తుందో అది, కచ్చితంగా 'రేడియో సిలోన్'.

ఇంగ్లీషు—ప్రతిదినం

| | |
|---|---|
| 0600 to 1000 hrs | 15525 KHZ (19 మీ)<br>9720 KHZ (31 మీ)<br>6075 KHZ (49 మీ) |
| 1800 to 2300 hrs | 15425 KHZ (19 మీ)<br>9720 KHZ (31 మీ)<br>7190 KHZ (41 మీ) |

హిందీ—సోమవారం నుండి శనివారం వరకు

| | |
|---|---|
| 0600 to 1000 hrs<br>1200 to 1400 hrs<br>1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ)<br>7190 KHZ (41 మీ)<br>11800 KHZ (25 మీ)<br>6075 KHZ (49 మీ) |

హిందీ—ఆదివారాలు మాత్రం

| | |
|---|---|
| 0600 to 1400 hrs | 11800 KHZ (25 మీ)<br>7190 KHZ (41 మీ) |
| 1900 to 2300 hrs | 11800 KHZ (25 మీ)<br>6075 KHZ (49 మీ) |

తమిళం—ప్రతిదినం.

| | |
|---|---|
| 1630 to 1900 hrs | 11800 KHZ (25 మీ)<br>6075 KHZ (49 మీ) |

మలయాళం—ప్రతిదినం

| | |
|---|---|
| 1530 to 1630 hrs | 11800 KHZ (25 మీ)<br>7190 KHZ (41 మీ)<br>6075 KHZ (49 మీ) |

తెలుగు—ప్రతిదినం

| | |
|---|---|
| 1430 to 1530 hrs | 11800 KHZ (25 మీ)<br>7190 KHZ (41 మీ) |

కన్నడం—ప్రతిదినం

| | |
|---|---|
| 1400 to 1430 hrs | 11800 KHZ (25 మీ)<br>7190 KHZ (41 మీ) |

విదేశాలలో వ్యాపారాభివృద్ధి కోరుకునే ప్రకటన దారులు ఈ విలాసాన్ని సంప్రదించండి.

రేడియో అడ్వర్టైసింగ్ సర్వీసెస్
సిసిల్ కోర్ట్
లాండ్స్ డౌన్ రోడ్
బొంబాయి 400039
టెలిఫోన్ : 213046/7
గ్రామ్స్ : RADONDA

30, పిక్ట్ క్రాఫ్ట్ క్రాస్ స్ట్రీట్
మందవల్లిపాక్కం
మదరాసు 600028
టెలిఫోన్ : 73736
గ్రామ్స్ : RADONDA

CHANDAMAMA (Telugu) MARCH 1978 Regd. No. M. 4854
everest/929/PP-tl